ఓం

శ్రీ రాఘవేంద్రాయ నమః

# శ్రీ రాఘవేంద్ర నీతిసుధ



గ్రంథకర్త:

తిరుపతి రామచంద్రకవి

---

THE BOOK IS
PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE
OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ప్రథమ ముద్రణ:
జూలై, 1983

ప్రతులు 2500



ప్రకాశకులు :
తిరుపతి రామచంద్రకవి
ఎల్. ఐ. జి. నెం. 5
హౌసింగ్ బోర్డు కాలనీ
కపిలతీర్థము రోడ్డు, తిరుపతి.

ముద్రాపకులు :
శ్రీ బాలాజీ ప్రెస్,
గాంధీ రోడ్డు-చిత్తూరు.

మూల్యము :
ఆరు రూపాయలు.



# నా మాట

మనసులోని ఆలోచనలను మాటలుగా మలచడం కవిత్వ బాహ్య స్వరూపం. ప్రజానాడిని పట్టిచూసి పదిమందికి చెప్పడంలో కవిత్వాని కంటే మించిన సాధనం నాటికి నేటికి మరొకటిలేదు.

ఒక రచన చేపట్టడానికి యెన్నో కారణాలుంటాయి. తన బాధను కవిత్వంలో చెప్పుకోవాలనే ఆదుర్దా కొందరిది. సాటివారి అగచాట్లు చూస్తూ సానుభూతి ప్రకటిస్తూ ప్రతినిధిగా పద్యాలో, కథలో, మరో సాహిత్య ప్రక్రియ చేపట్టడం మరికొందరిది. తనది కాకపోయినా, తన వారికి సంబంధించినదైనా, కేవలం ప్రోత్సాహంతోనో, బలవంతంతోనో రచన సాగించడం మరికొందరిది. నేనిదివరలో ''పార్వతీపతి, వేంకటేశ్వర, గోపికాప్రభు, శ్రీరామచంద్రప్రభు శతకములు రచించినాను. అవన్నీ యించుమించు భక్తిశాఖకు చెందినవే. అక్కడక్కడా అడపా దడపా కొన్ని నీతులున్నా, నిందలున్నా, విమర్శించే పంథాలో సాగింది కాదు. కానీ పరుగెడుతున్న లోకం, మారుతున్న సమాజం, నిలకడలేని వ్యక్తిత్వం, పతి

శీలించేటప్పుడు వీటిని చూస్తూ ఊరుకోవడం కవికి చేతగాని పని. లోకంలో అధర్మం వెర్రితలలు వేస్తున్నది. అన్యాయం వేయి నాల్కలతో మాట్లాడుతుంది అక్రమాలు. ఈ సర్ప పుట్టలా విజృంభిస్తున్నవి. ధర్మం, న్యాయం, సత్యం ఇసుకలో పారేసిన ముత్యాలై పోయాయి, అందుచేతనే కవిత్వాన్ని వాహికగా తీసికొని ఈ 'రాఘవేంద్రనీతిసుధ' వ్రాశాను. తన్మూలంగా ప్రజల్లో ఆలోచన కలిగించడం నా ధ్యేయం. ఈ పని నా ఒక్కనివల్ల అయ్యేది కాదు. నా రచనలవల్ల ఏ హృదయంలో నయినా స్పందన కలిగితే నా భావాలు ఏ పాపాత్ముని కళ్లకు మెరపయితే నా ఆలోచనలు ఏ హృదయంలోగాని హూత్తుకో గలిగితే అదేచాలు. ఎవరిని ఏ సంఘటనలను మనసులో ఉంచుకొని వ్రాసిన పద్యాలివి కావని పాఠకులకు నా మనవిగా విన్నవించుకొనుచున్నాను.

సుధీవిధేయుడు,

తిరుపతి రామచంద్రకవి.

శ్రీ వాణీ ప్రసన్నా భవతు

విద్వాన్ P. V. శ్రీనివాసమూర్తి, M. A.
ఆంధ్రోపన్యాసకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల, తిరుపతి.

# పీఠిక

దేశ కాల వాతావరణ స్థితులనుబట్టి- ఆయా జాతుల స్వరూప -స్వభావం-ఆచారవ్యవహారాలు-ఆహారవ్యవస్థ-వేషం మొదలైనవి ఏర్పడినట్లే వాటినన్నింటినీ ప్రతిబింబింపజేసే భాషలుకూడా ఆ ప్రత్యేకలక్షణాలతో ఒప్పి విలసిల్లుతూ ఉంటాయి. యాసలతో, ధ్వనికలతో, స్వరాలతో, వర్ణాలతో వెల్లడి అయ్యే ఆ జాతి వాక్కునుండీ ఆ జాతి లక్షణాలు ఉట్టి పడుతూంటాయి. గద్య పద్య గేయాదుల మూలంగా తన తోడి వారికేగాక ముందు తరాలవారికి కూడా తన వాఙ్మయాన్నంతా మూటగట్టి ఆ జాతి అందిస్తూ ఉంటుంది.

అనాదిగా - ముప్పదియారు వర్ణాలతో ముచ్చట గొల్పే తెలుగు మాట్లాడే జాతి మనది. కాలక్రమంలో - అవసరాన్నిబట్టి మిగిలిన పంతొమ్మిది వర్ణాలువచ్చి తెలుగులో కలిసినవే. అసలు తెలుగు పదాలన్నీ అల్పాక్షరయుక్తాలు - మీదు మిక్కిలి షడ్వర్ణపర్యంతాలే - అగుటచేతనే మూడు నాల్గు - అయిదు - ఆరు మాత్రలతో కూడిన గణాలతో మన జాతి పద్యాలూ గేయాలూ విలసిల్లుతూన్నాయి. ఆట వెలది - తేటగీతి - సీసము - అక్కరలు - తరువోజలు మొదలైనవన్నీ ఈ కోవలోనికి చెందినవే.

ఎన్నో వంకలూ - వాగులూ - నిత్యము కలుస్తూ ఎప్పటికప్పుడు సరిక్రొత్త రూపాన్ని సౌందర్యాన్ని వహిస్తూ ప్రవహిస్తూన్న జీవనదుల్లాగా దేశభాషలు కళకళలాడుతూ నాట్యమాడుతూ ఉంటాయి. ఆ సరిక్రొత్తరూపంలో ఆ భాషల మూలతత్త్వం మాత్రం మిసమిసలాడే లావణ్యంలాగా ఎప్పుడూ తొణికిసలాడుతూనే ఉంటుంది. తరతరాలుగా - ఎన్నో భాషలతో కలసి మెలసి తిరుగుతూ - ముఖ్యంగా అతి ప్రాచీనమూ - మహాగంభీరమూ అయిన సంస్కృతభాష యొక్క ధాటికి తట్టుకొనడమేగాక - దానిని తన కైవసం చేసికొని - తన దారికి త్రిప్పుకొన్న గడుసైన భాష తెలుగు భాష. ఏ భాషనుండీ - ఏమి తెచ్చుకొన్నా - అది తెలుగు వారిచేత పడిన నాటినుండీ-అది తెచ్చుకొన్నట్లుండక-చక్కని తెలుగు తనంతో సాక్షాత్కరిస్తూ ఉంటుంది.

సంస్కృతంలో - సర్వసాధారణంకాని - గద్యపద్యమయమైన చంపూ మార్గాన్ని చేపట్టి మనోహరంగా మహాకావ్యాలనేకంగా రచించి దిట్టలనిపించుకొన్నారు తెలుగు వారు. ఇతి వృత్తాన్నిబట్టి - సన్నివేశాన్నిబట్టి - పాత్రనుబట్టి-భావాన్నిబట్టి - రసాన్నిబట్టి రీతి వైవిధ్యాన్ని ప్రదర్శించడమే గాక - వ్యస్తసమస్తాలుగా తెలుగు సంస్కృతపదాలను విడి విడిగా ప్రయోగించడమే గాక - ఆ రెండింటిని రసోచితంగా మేళవించి - వానిని జాతి పద్యాలలో సంస్కృత వృత్తాలలో పొందుపఱచి ఆంధ్రకవితా రీతిలో ఒక క్రొత్త జిగిబిగిని సాధించారు. దేశభాషలలో తెలుగు లెస్స యని పలికించారు. సంస్కృతంలో సమగ్ర వికాసాన్ని పొందక - ప్రచారానికి నోచుకోని - చంపకోత్పలాది వృత్తాలను - తెలుగు తీరును సొరునుగూర్చి కబ్బాలలో ప్రయోగించి ఆ సంస్కృత వృత్తరీతిని మరపించారు.

చక్కగా పరిశీలిస్తే - స్వరవర్ణసంయోజనంలో - పదముల కూర్పులో - యతిప్రాసల సంవిధానంలో - చరణవిన్యాసంలో పద్యపు ఎత్తుగడల్లో - ముక్తాయింపులలో - తెలుగు కవులు నిగూఢంగా నిక్షేపించిన పద్యశిల్ప రహస్యాలెన్నో గోచరిస్తాయి. పడవ సంచలనానికీ - వేగానికీ - తోడ్పడే తెడ్డులాంటిదే - తెలుగు పద్యపాదాల్లో ద్వితీయాక్షరంగా ఉండే ప్రాసకూడా - అది వ్యంజన ప్రధానమైనది. ఎక్కువ క్షేపణులతో నడిపినప్పుడు వేగాన్ని పుంజుకొనే పడవలాగా - అనేక ప్రాసలతో ఒప్పే పద్యంకూడా మిక్కిలి సంచలనంతో సాగిపోతూ ఉంటుంది. అంతేగాకుండా - ప్రాస అనేది పద్యానికొక విధమైన లయాత్మక గుణాన్ని ప్రసాదించే వీణలాంటి వాద్యం. వీణానాదం సరసులను ఆనందపుటంచుల్లోనికి తీసికొనిపోయేటట్లు, తెలుగు పద్యంలోని ప్రాసకూడా తీసికొనిపోతుంది. బహుప్రాసయతులతో గూడిన లయగ్రాహి-లయవిభాతి-లయహారి - మున్నగు పద్యాలను తెలిసి పఠిస్తే యీ సత్యం బాగుగా బోధపడుతుంది. ప్రాచీనాలంకారికులందరూ-ప్రాసను శబ్దాలంకారంగా గ్రహించి వృత్తి - లాట - ఛేకాద్యను ప్రాసలుగా ప్రకటించారు. అభిజ్ఞులైన తెలుగు కవులందరూ-సమయోచితంగా-ఏక - ద్వి - త్రి- చతుష్ప్రాసాదులను - సుకర దుష్కర భేదాలతో సంవిధానపఱచి - తన్మూలంగా రూపరసభావాలను సాక్షాత్కరింపజేశారు. పద్యశిల్పంలో సకలవిద్వత్సంస్తవనీయులైనారు. అట్టివారి పద్యాలీనాటికీ చెక్కుచెదరకుండా - తెలుగునాట వాడవాడలా భజన కీర్తనలై రాణిస్తున్నాయి. వారి కవిత్వ పటుత్వ శక్తి యట్టిది.

సంస్కృతంలోవలె - కేవలం విరామ విచ్ఛేదాత్మకంగా మాత్రమేగాక స్వరప్రధానమై సంవరణాత్మకమైన

తెలుగువారి యతి, పద్యంలోని యెత్తుగడను నిరూపిస్తూ - తాళాత్మకగుణాన్ని కలిగిస్తూ - నూతనోత్తేజాన్ని ప్రసాదిస్తుంది. బాగుగా పరిశీలిస్తే మహాశిల్పులైన తెలుగు కవులందరూ పద్యమునందలి ముఖ్యమైన భావమునో, పాత్రతత్త్వమునో, రసమునో ఈ యతి ప్రాసస్థానాల్లో అనుసంధించే వర్ణాలరూపంలో ప్రాణప్రతిష్ఠగావించి ఆరాధించారు. యతిని కూడా నూత్న సౌందర్యంతో భాసించేటట్లు చేశారు. కాలక్రమంగా తెలుగుయతి కవుల చేతుల్లో-ఎన్నో పరిణామాలను పొందింది. సజాతి వ్యంజనయుక్తమై మైత్రీ స్వరసంపన్నమైన వర్గజాదియతులకన్నా - మైత్రీ స్వరాలతో మూర్తీభవించే వ్యంజనైకయతులకన్నా - స్వరవ్యంజన సామాన్యమైన సమానాక్షరయతి సంవిధానంలో గోచరించే సౌందర్యం అమేయమైనట్టిది. అన్యములైన - అనుస్వారసంబంధాది యతులన్నీ - కవితాధారను- భాషాపాటవాన్ని పాండిత్యాన్ని ప్రకటిస్తాయి. తెలుగుజాతి పద్యాలకు - సమానాక్షరయతికన్నా - ప్రాసయతి సంవిధానం మంచి సొగసును కలిగిస్తుంది. అది తాళ లయాత్మకాది గుణములతో విలసిల్లడమే దానికి ముఖ్యకారణం. ఇక - జాతిపద్యంలో - పదాద్యక్షరంపై యతిని సంఘటిస్తే అది పద్యపుటెత్తుగడను పట్టియిస్తూ - తాళాత్మకంగా విలసిల్లుతూ - నూతనోత్తేజాన్ని కలిగిస్తూ - రూపరసభావాలను కన్నుల యెదుట నిల్పుతుంది. పదమధ్య - పదాంతాక్షరాలపై యతి సంఘటనం దేశి పద్యాలకు సొగసు నొసంగదు. వృత్తాలలో అట్లు చేస్తే గడుసుదనాన్ని పోషిస్తూ - కవి ధారను పాండిత్యాన్ని ప్రకటిస్తాయి.

ఉన్నమాట చెప్పాలంటే - ప్రాసగల పద్యాలను ప్రాసలేని పద్యాలను రచించేటప్పుడు తెలుగుకవులు చాలా వైవిధ్యాన్ని చూపించారు. సంస్కృతం నుండి తెచ్చుకొన్న

వృత్తాలు కాక - తెలుగుజాతి పద్యాలన్నీ మామూలుగా ప్రాసలేనట్టివే. వృత్తాల్లాగా ఇవి నియతగణ బద్ధాలుగావు. జాతిపద్యాలన్నీ మాత్రాగణ విలసితాలు. ఈ మాత్రాగణాల్లో అయిదు మాత్రాగణాలైన రగణ, సలాలు విలాసగణాలు - అంటే ఒయ్యారంగా నడుస్తూ హొయలునొలికించేవి. తగణం రాజసగణం - అనగా తీక్ష్ణతను - చులుకుతనాన్ని - ఊపును చూపించే గుణంగల గణమన్నమాట - నలము సౌమ్యమైనట్టిది. భగణ-నగములు, మధ్యమములు - సూర్యగణ సాహచర్యంతో ఈ రగణ-తగణ-సలములు కలసి మెలసి సాగేటప్పుడు గోచరించే తేజ స్సౌందర్య వైభవ విలాసాదులు చదివి తెలిసికోదగినవే కానీ - వివరించి చెప్పడానికి సాధ్యంకాని విషయాలు. కళాత్మకమైన చిత్రాన్ని లిఖించి - దానికి తగిన రంగుల నెన్నుకొని - వానిని కలపడంలో చిత్రకళాకారుని ప్రజ్ఞ గోచరించినట్లే - రసభావోచితములైన పదాలను గ్రహించి - వాని కనుగుణమైన మాత్రాగణాల నెన్నుకొని పొందు పఱచడంలో కవి నైపుణ్యం తెలుస్తుంది. ఎంతటి ప్రతిభావంతునకైనా - అది నిరంతర సాధనవలన మాత్రమే సిద్ధిస్తుంది. ఒక్కరోజులో వచ్చేదికాదు.

గణంలో పదమిమిడిపోయేట్లు వ్రాస్తే జాతిపద్యం అందంగా ఉంటుంది. గణంలో నుండీ మీది గణంలోనికి పదం చొచ్చుకొనిపోతూ గొలుసు కట్టుగా సాగుతూ ఉంటే వృత్తాలందంగా ఉంటాయి. పాదంతో బాటు - భావంకూడా - చరణాంతంలో ముగిస్తే జాతిపద్యం శోభిస్తుంది. భావంగానీ పదంగానీ ఆగకుండా ముందు పాదంలో ఉండే ప్రాసనుదాటి గమిస్తే వృత్తాలందంగా ఉంటాయి. సంస్కృత వృత్తం ఈ విధంగా నడువలేదు. తెలుగు తీరుతెన్నుల్లో నడిచే ప్రాస గల వృత్తాలను రచించేటప్పుడు పద్యశిల్ప కోవిదులైన

తెలుగు కవులు గీర్వాణంలో చెప్పిన పాదాంత విరామంలో అందంలేదని పరిత్యజించారు. సరస సంగీత సాహిత్య స్వరూప నిరూపణ కేంద్రాలైన యతిప్రాసల సంయోజనతో – విశిష్ట పద సంవిధానరీతీసౌభాగ్యంతో – మధుర గంభీర చరణ విన్యాస విలాస సౌందర్యంతో సాగిపోయే తెలుగు పద్యం రసిక హృదయాల నాకర్షించి – ఆహ్లాద పఱచినట్లు తదితరములకు సాధ్యముగాదు. పద్యశిల్పంలో తెలుగు కవుల చూపించిన విశేషాలింకా యెన్నో ఉన్నాయి. కళాహృదయంతో గూడా మంచి వ్యుత్పత్తిగల వారికి మాత్రమే అవి గోచరిస్తాయి.

దేశకాల పరిస్థితులనుబట్టి కావ్య ప్రయోజనాలు మారుతూ ఉంటాయి. దేశం సుభిక్షంగా శాంతి సౌభాగ్యాలతో తులతూగేటప్పుడు కావ్య ప్రయోజనాల్లో ఒకటైన ఆనందానికి పట్టాభిషేకం చేస్తే తప్పేమీలేదు కానీ–దేశం – అధర్మంతో – అవినీతితో యుద్ధాలతో – దాస్యంతో – కఱవు కాటకాలతో – అట్టుడికినట్లుడికిపోతూంటే – ఆనందమే పరమ ప్రయోజనంగా ఉండే కావ్యాలకంటే ప్రబోధాత్మక కావ్యాలకై ప్రజానీకం ఎదురు చూస్తూ ఉంటుంది. అట్టి కావ్యాలు ప్రజలకు నవచైతన్యాన్ని కల్గించి – ముందుకు నడిపిస్తాయి. అప్పుడు కావ్య ప్రయోజనాల్లో ఆనందానికంటే ఉపదేశమే ప్రముఖమై అగ్రాసనాధిపత్యాన్ని ఆక్రమిస్తుంది – అది అనివార్యం.

కవి యన్నవాడు కళ్ళుప్పగించి, దేశ దుస్థితిని చూస్తూ చేతులు ముడుచుకొని ఊరక కూర్చోలేడు. తన రసమయోక్తులతో ప్రజానీకానికి ఆత్మవిశ్వాసం కల్గించి ముందుకు నడిపిస్తాడు. ఈ రసమయోక్తులను ఖలముగాని కావ్యముఖంగా వ్యక్తం చేస్తాడు. ఆంధ్ర దేశంలో–ప్రాచీనకాలంనుండీ ప్రబోధాత్మక కావ్యప్రక్రియల్లో శతకం అగ్రగణ్యంగా రాణిస్తూ

ఉంది. తెలుగులో - ముఖ్యంగా క్రీ. శ. 12 వ శతాబ్దంలో వెలసిన - పండితారాధ్య పాల్కురికి సోమనాథాది కవుల కాలం నుండీ నేటికీ అవిచ్ఛిన్నంగా అసంఖ్యాకంగా కొనసాగే ఏకైక సాహితీ ప్రక్రియ శతకమనునట్టిది. అది తెలుగుజాతి గర్వంగా చెప్పుకో దగినట్టిది కూడా. అలనాటినుండీ-నీతి - భక్తి - వేదాంతం- శృంగారం-విమర్శ - అన్యాపదేశం - స్తుతినింద - నిందా స్తుతి - మున్నగు రూపాలతో-వివిధ పద్యాలలో-విభిన్న తుకుటాలను ధరించి ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా శతకం సాక్షాత్కరిస్తూ ఉన్నది. ఎప్పుడే రూపంతో ఏ వేషంతో అది ప్రత్యక్షమైనా జాత్యుద్ధరణమే దాని పరమ ప్రయోజనంగా ఉంది. ఆనందం ఆనుషంగికం మాత్రమే.

యాస-ఊనిక స్వరాలతో ఒప్పే తెలుగు నుడికారపు బాంకము - తెలుగుజాతి పద్యమైన ఆటవెలదిలో ఇమిడినట్లు ఇతర పద్యాలలో నమరదు. చిన్నచిన్నవైన తెలుగు పదాల నమర్పుట కనువైన మూడు మాత్రాగణా లెక్కువగా ఒక వరుసలో నుండటమేగాక -ఆ యాస-ఊనిక-స్వరాలను పలికించే ఐదు మాత్రాగణాలతో కలసి నడయాడే పాదాలుండుటయూ ముఖ్య హేతువుగా నొప్పారుతూంది. అంతేగాక- వేమన ఆటవెలదిని చూచిన నాటినుండీ- తెలుగు కవులకు ఆటవెలదిపై మఱీ మోజు ఎక్కువై పోతూంది. ఇది యింకొక కారణంగా ఉంది.

ప్రజానీకంచేత తిరుపతి రామచంద్ర కవిగా పిలువబడే శ్రీ వేమూరి రామచంద్రా రెడ్డి గారు-సాధుస్వభావులు-ఋజువర్తనులు-భక్తి సంపన్నులు - మీరుమిక్కిలి సహజకవులు. ఈ కవిగారు ఇప్పటికే - చంపకోత్పల శార్దూల మత్తేభాది వృత్తాలలో - మహాప్రౌఢమైన రీతిపై విధ్యంతో - పార్వతీ

పతి-వేంకటేశ్వర-గోపికాప్రభు-రామచంద్రప్రభు శతకాలను రచించి విద్వజ్జనుల ప్రశంసల నందుకొనడమేగాక ఆంధ్ర దేశంలో వాడవాడలా బహుసన్మానాలను పొందియున్నారు. ఆ శతకాల్లోని భావ నివేదనంలో దాగిన వారి ఆవేశం- వృత్త రచనా శిల్పంలో చూపించిన నైపుణ్యం - భక్తితత్త్వం - లోకపుతీరు మున్నగు గుణాలు అపూర్వం. ఇంత చక్కని కవితాధార వీరికెట్లు పట్టుబడిందా అని సహృదయులాశ్చర్య పడుతూంటే - కొందరు అసూయ కూడా పడేవారున్నా రంటే అతిశయోక్తి కాదు. అది వారి వారి సుకృత దుష్కృ తాలకు ప్రతిబింబాలు. ఒక్కమాటలో చెప్పాలంటే వీరి శతకాలన్నీ - మన పూర్వకవుల శతకాలను మరపింప జేస్తూ న్నాయి.

ఇప్పుడు "రాఘవేంద్ర నీతి సుధ" అన్న పేరుతో గొప్ప పేరు పొందే సరిక్రొత్త గ్రంథాన్ని-ఆటవెలదుల్లో ఈ కవిగారు ఆంధ్రావనికి అందిస్తూన్నారు. ఇందు మూడు వంద లకు పైగానున్న గీతి పద్యాలన్నీ-ఉత్తమ జాతిపద్య శిల్పంతో మిక్కిలి సుందరంగా ఉండడమేగాకుండా - తియ్యని తేట తెలుగు జాతీయాలతో, పలుకుబడులతో, విరాజిల్లుతున్నాయి. ఆ నాడు మహాభక్తులైన రామదాస-త్యాగరాజాది కవులతో వాగ్గేయ కారులతో వినుతుడైన రామచంద్రుడు - ఈ నాడీ రామచంద్ర కవిచేత రాఘవేంద్రుని రూపంలో వినుతింప బడుచున్నాడు. అంటే-వారిలోని భక్తి రీతులను సర్వవిధ ములా వీరి కవితామతల్లి పుణికి పుచ్చుకొన్నదని చెప్పడం పునరుక్తమే అవుతున్నది. తెలుగు జాతి పద్యమైన ఆటవెల దిలో అంత్యాను ప్రాసలతో సంస్కృత సమాసాలను భగ వత్సంబోధనములుగా లాగడమంటే-అది చెయి తిరిగిన

పోతనాది భక్త కవులకే సాధ్యమైన విషయం. వీరి స్తోత్ర పద్యాలన్నీ ఈ రీతిలో సాగినట్టివే. అవి పద్యాలుగా గాక-రసవంతమైన భక్తి గీతాల్లాగా భాసిస్తూ ఉన్నాయి. మన సుంచి చదివితే తెలుస్తుంది.

జీవితంలో చేసిన తప్పొప్పులను - వాని మూలంగా అనుభవిస్తూన్న బాధలను ఏ మాత్రం దాపరికం లేకుండా ముఖ్యంగా కావ్యముఖంగా వెల్లడించాలంటే అభిజాత్యం - ఐశ్వర్యం - అంతస్థు - సిగ్గూబిడియాలు - మొదలైనవన్నీ ఎవ్వరికైనా అడ్డు వస్తాయి. అట్లు తెలియ జేయాలంటే పండిన మనస్సుగల నిండైన విరాగులకే సాధ్యమౌతుంది. మన తెలుగు వాఙ్మయాన్నంతా గాలిస్తే - ధూర్జటిలాంటి మహాకవులు కొందరే అట్టివారుగా గోచరిస్తారు. ఈ కవిగారు జీవితంలో తాము గావించిన తప్పులను - తన్మూలంగా తాము అనుభవిస్తూన్న యిడుముల నన్నింటినీ మిక్కిలి ఆవేదనతో రాఘవేంద్రునికి మొరపెట్టుకొన్నారు. ఈ పద్యాలన్నీ కరుణార్ద్రములేగాక - జనులకు భావిజీవితంలో తప్పటడుగులు వేయకుండుటకైన మంచి హెచ్చరికలు గూడా.

సమకాలీన సంఘంలో ఉండే వివిధ పరిస్థితులను వ్యక్తుల స్వభావాలను - దోషాలను - దౌర్జన్యాలను - స్వపరభేదం లేకుండా - జంకుగొంకులు లేకుండా - రాగద్వేషాతీతంగా - ఉన్నదున్నట్లుగా చెప్పాలంటే, గట్టి గుండెధైర్యం ఉండాలి. పూర్వులలో ధీరుడైన - ఒక్క వేమన యోగికే అది సాధ్య

మైంది. ఈనాడు ముఖ్యంగా – మన దేశంలో దినదినానికి హెచ్చు పెరిగి పోతూన్న – కామాంధుల మదోన్మత్తచేష్టలూ – మానభంగాలు–విచ్చలవిడిగా జరుగుతూన్న దోపిడీలు–దొంగ తనాలు – ధనమదాంధుల దౌర్జన్యాలు–నాస్తికుల ప్రలాపాలు విగ్రహాల చౌర్యాలు – మదవతుల విశృంఖల విహారాలు – చంచల రాజకీయనాయకుల వంచకత్వాలు–ఉద్యోగుల లంచ గొండి తనాలు – అలసత్వాలు – విద్యార్థుల ధూర్తత్వం – ఒక్కటేమిటి? తాము విన్నవి – కన్నవి, అన్నింటినీ ఇందలి ఆటవెలది పద్యాల్లో అద్దం పట్టి చూపించారు. అట్టిమెడ వారి ఆవేశ – ఆవేగాలు – వడి వాడిగల వారికలం నిరూ పిస్తూన్నది. ఆ పద్యాలను పఠించేటప్పుడా విషయాలు స్పష్ట మైతాయి. క్షీరసాగర మథనం ద్వారా సుధ నందించినట్లు ఇందెన్నో హితోక్తుల నందించారు. సర్వవిధములా – రాఘు వేంద్ర నీతి సుధ సార్థకమై విలసిల్లుతూంది. జగత్కల్యాణార్థమై సుకృతులైన శ్రీ రెడ్డిగారు అనేక కృతుల రచిస్తారని – అభిలషిస్తూ – దానికి వలయు ఆయురారోగ్య భాగ్యాలను వేంకటేశ్వరుడు అనుగ్రహింపగా ప్రార్థిస్తూన్నాను.

" సర్వేజనాః సుఖినోభవన్తు "

ఇట్లు,

సరసకవితాభిమాని,

పి. వి. శ్రీనివాసమూర్తి.

తిరుపతి,

21—3—83

# ముందుమాట

శ్రీ రామచంద్రారెడ్డిగారు నాకు చిరపరిచితులు. వీరింతకు మునుపే నాలుగు శతకములు రచించి 'తిరుపతి రామచంద్రకవి'గా పేరు కెక్కినారు. శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారి మూలమున నాకు వీరితో మొదట పరిచయమేర్పడినది. అనంతరము వీరి కవితాధోరణియే ప్రగాఢ పరిచయమునకు కారణమైనది. ఎన్నో కష్టనష్టములకు గురియైన వీరిలో ఉన్నట్లుండి అతి సహజముగా అనుభవ పరంపరల నుండి కవితా విర్భావము జరుగుట గమనార్హము. ఉత్తమ కవిత్వమునకింతకంటె ప్రమాణమిక నేమున్నది? ఛందశ్శాస్త్ర పారీణతగాని, లేక వివిధశాస్త్ర వైదుష్యముగాని సత్కవితకు ఆలంబనము కాదని వీరి రచనను బట్టి యెవ్వరైన నిర్ధరింప వచ్చును. ప్రస్తుతము వీరి 'రాఘవేంద్ర నీతిసుధ' యను కృతికి 'రామచంద్రవినుత రాఘవేంద్ర!' అనునది మకుటము. 'రాఘవేంద్ర' అను పదమును వినగనే ఇది మధ్వమతమునకు సంబంధించినదా అని అనుమానము కలుగవచ్చును. సర్వసమ్మతములైన అభిప్రాయములను ఎంతో సహజపద్ధతిలో వెలిబుచ్చుటయే వీరి యభిమతము. అంతకుమించి మరియే మతమును వీరికి సమ్మతము కాదని నేను వీరిని చూడగనే గ్రహించితిని. శ్రీరామచంద్రారెడ్డిగారు మంచివలన గలుగు సత్ఫలితమునే గాక చెడువలన గలుగు దుష్ఫలితమును కూడ అనేక పద్యములలో ప్రతిపాదించుచు వచ్చిరి. ఒప్పు తప్పు లేవియో కూడ ఇట్లే వివరించుచువచ్చిరి. ఇంతే గాక నీతి శతకములోని కొన్ని భావములను కూడ సర్వస్వతంత్రముగా తన అనుభవమునకు సమన్వయించుచు వివరించిరి. 'మూకం కరోతి వాచాలం' వంటి శ్లోకముల భావములను కూడ వీరచ్చటచ్చట అనుసరించిరి. ఇట్లు వీరి శతకములో ఒక్క నీతియే కాక ఎన్నో విషయములు చోటు చేసుకొన్నవి. 'కవిత యనంగఁ బద్య

ములఁ గద్యముల' రచించుట కాదు. 'భావ విలసనము లో
హితవర్తనమును' బచరింపఁ జేయవలయునను ధర్మము
పరిపూర్ణముగా నిందు నిరూపించిరి. 'ప్రపంచ వ్యాఖ
ప్రకటన కళాకౌశలనిధి'యైనవాడే సహజకవి. సత్క
ఇట్టి సత్కవితా ధర్మము శ్రీరామచంద్రా రెడ్డిగారి ఆటవె
పద్యములలో పరిపుష్టముగా నున్నది.

వీరి ఈ కృతికి 'ముందు మాట' అనవసరము. కా
వారి కోర్కె మేరకు నాకు తోచిన దేదియో కొంత సూచ
మాత్రముగా పేర్కొంటిని. పద్యరచనను ఈసడించు
కాలములో ఇంత సహజముగా రచన గావించి నీతిసుధ
లోకమునకు వెదజల్లుట ఆశ్చర్యకరము. నేడు ప్రపంచము
ఊహింపరాని మార్పులు కలుగుచున్నవి. అందులో స్వార్థ
విలయతాండవము చేయుచు ప్రతిసంస్థలో కశ్మలము కరు
గట్టుకొనిపోవుచున్నది. ఈ విషయముల నన్నిటిని శ్రీరా
చంద్రా రెడ్డిగారు చాల చక్కగా ఆటవెలది పద్యముల
కూర్చి, లోకహిత వర్తన మెట్టిదో నిరూపించిరి. వారి య
కవిత చదివినచో నేటి లోక ధర్మమెట్టిదో అది మార్చు చెం
వలసిన విధాన మెట్టిదో మీకు విదితము కాగలదు. పఠ
నశక్తులు కావలసియున్న పాఠకులను ఈ నా పీఠికతో
గించుట మంచిది కాదు. ఇంకను వీరిట్టి కృతులను రచిం
లోకోపకారము కలిగించగలరని 'రామరాజ్యము నాశిం
వీరికి సర్వదా శ్రీరామచంద్రుడు ఆయురారోగ్యముల కూ
వలసినదని శ్రీరాఘవేంద్రుని అర్థించుచు ఇంతటితో
మించుచున్నాను.

ఇట్లు,

డా॥ మల్లెల గురవయ్య.
ఎం.ఏ., పి.హెచ్‌డి.
దివ్యజ్ఞాన కళాశాల, తెలుగుశాఖాధ్యక్షులు, మదనపల్లె

శ్రీమతి భాస్కర స్వర్ణాంబ, ఎం.ఏ; ఎం. ఫిల్.;
ఆంధ్రోపన్యాసకురాలు, శ్రీ పద్మావతీ మహిళాకళాశాల, తిరుపతి.

# అ భి ప్రా య ము

"కాలమునకు దగిన కబ్బమొక్కటి వ్రాయబూని నాడ" - అంటూ, ఆవేదన, దైవమహిమ, భాగవతులు, విమర్శ, విద్యార్థి, తప్పొప్పులు, లోకపుతీరు, కాలవైపరీత్యము, కాముక చిత్తవృత్తి, విధివిలాసము - మొదలైన పలుశీర్షికలతో 400 కు పైగా పద్యాలను ఎంతో హృద్యంగా మలచినారు. "శ్రీరాఘవేంద్ర నీతి సుధ" లో శ్రీరామచంద్ర కవిగారు జీవిత సంద్రాన్ని మథించగా వచ్చిన అనుభవ సుధ ఈ 'రాఘవేంద్ర నీతి సుధ'.

ఈనాటి సమాజంలో ఎక్కడ చూచినా ఏదో గందరగోళం. మనిషిని మనిషి పీక్కు తింటున్నాడు. నిస్సహాయుల నిట్టూర్పుల నెగళ్ళలో దుర్మార్గులు చలికాచుకుంటున్నారు. ఈ అవ్యవస్థను చూచిన కవి హృదయం ద్రవించింది. 'నవరసంబులొల్కు చవిబుట్టు కబ్బము వ్రాయలేను' అని మృదువుగా విన్నవించుకుంటూ, 'కవితలల్లు బాధ కవి యెరుంగు' అన్న నిజాన్ని నివేదిస్తూ, సహృదయులు మెచ్చే నీతి సుధను అందించినారు కవిగారు.

'కట్నములను గోరి కాంతల హింసించు
ఘాతుకులకు తగిన నీతిగలదె ?' (-96)
'జంతుబలి యొసంగి జాతరలను జేయ,
ముక్తి లభ్యమగునె మూర్ఖులకును ? జీవ
హింస నట్టి దేవత గోరునె ?' (-100)

అంటూ కొన్ని సాంఘిక దురాచారాల్ని నిరసిస్తూ ఆవేదన చెందుతాను కవి.

"మాంసభక్ష్యమందు మమతతో పలుమారు
సాధుజంతువులను చంపి తినిన, భక్తి రుచి
రొయసంగ ముక్తి లభ్యంబౌనె ?"
"తలలు బోడి జేయ దైవము మెచ్చునా ?
జీవహింస జేయు చెనటులకును ?
హింస మానినంత యిష్టదైవము మెచ్చు" (-161)
"పిడికెడన్నమిడిన విశ్వాసమును జూపు
కుక్క కన్నమిడని కూళకన్న భిక్షకుండు మేలు
పేరాశ జూపడు – " (-309)

అని కొన్ని వాస్తవ విషయాల్ని మనముందుంచి హృదయమున్న మనిషైతే ఆలోచించమంటారు.

"......వినగ వినగ మదికి విసుగు కలిగె – "(278) అన్న మాటల్లో, నేటి రాజకీయ వ్యవస్థపట్ల మేధావుల్లో పాదుకున్న నిర్లిప్తత వ్యక్తమౌతున్నది.

'భూతదయను మించు పుణ్యకార్యమదెద్ది ?
కోపమునకు మించు పాపమెద్ది?'
'కలిమి కలిగినంత, కరుణ లేకుండిన
ఘనత కలుగగలదె? ' – వంటి సూక్తులు ప్రతివ్యక్తి హృదయ ఫలకంపై చిత్రించుకోనవలసినవి.

ఇందులో చాలా పద్యాలు చిన్నపిల్లలు కంఠస్థము చేయతగినవి. సంఘంలో పలువురిలో ఈ నాడు కనిపిస్తున్న ధనాశ, సుఖలాలసత్వము, స్వార్థపరత్వము, అవినీతి, మొదలైన దుర్గుణాలన్నీ మాసిపోయి, సువ్యవస్థతో కూడిన చక్కని సమాజస్థాపనకు, కనీసం రాబోయే తరానైనా కృషి చేయడం అవసరం. అందుకు ఇటువంటి పుస్తకాలు దోహదం చేస్తాయి. బాలల హృదయ భాండాలను ఈ రాఘవేంద్ర నీతి సుధతో నింపితే అది సాధ్యం కాగలదని నా భావన.

★

పరిమ అరవింద.

శ్రీ పద్మావతీ మహిళాకళాశాలాధ్యక్షురాలు, తిరుపతి.

# ఆ కాం క్ష

శ్రీ రామచంద్ర కవిగారి "రాఘవేంద్ర నీతిసుధ" చదివాను. భాష, భావమూ పడుగూపేకలాగ, కలిసిపోయి చాలా సరళంగా హృద్యంగా ఉన్నాయి. శీర్షికలన్నీ ఔచితీ నిర్వహణంతో పాఠకుల్లో చైతన్యాన్ని కలిగించేలా ఉన్నాయి.

ఆలుబిడ్డలందు ననురాగ మెక్కువై
కర్మమూలమైన కార్యములను
జేసి దిగులుఁ జెంది చింతించుచుంటిని.

అనడంలో కవిగారి హృదయావేదన, అనుభవైకవేద్యంగా, ఉంది దైవ మహిమలో,

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్.

అనే భావం చక్కగా నచ్చింది. భాగవతులు అన్న శీర్షికలోని భక్తులను గూర్చిన సోదాహరణ పద్యాలు ఆస్తికత తగ్గిపోతున్న ఈ రోజుల్లో భక్తిభావాన్ని మళ్ళీ పాదు కొలిపేలా ఉన్నాయి విమర్శ, లోకపుతీరు, కాముక చిత్తవృత్తి, కాల వైపరీత్యములలో సాంఘికంగానూ, నైతికంగానూ, రాజకీయంగానూ, నేడు దేశమున్న పరిస్థితి చక్కగా ప్రతిబింబిస్తూంది.

అనుభవం, వివేకం, ప్రతిభ కలిసి త్రివేణి సంగమంలా ప్రవహిస్తూన్న రససుధ రాఘవేంద్ర నీతిసుధ" ఇది పాఠకుల హృదయారామాల్లో సుధారసాన్ని చిలకరించి అలరిస్తుందని నా భావం. విశ్వశ్రేయం కావ్యం.

# అభిమతం

శ్రీ కె. వి. సుబ్బరామయ్యగారు,
రిటైర్డు ఉపవిద్యాశాఖాధికారి - తిరుపతి.

శ్రీ తిరుపతి రామచంద్ర కవిగారు నాకు 10 సంవత్సరములుగ తెలిసినప్పటికి వారింత మంచి కవిత్వము చెప్పగలరని కర్ణాకర్ణిగ వినడమేగాని ప్రత్యక్షానుభవం లేదు. నేడది కలిగినది. ఈ రాఘవేంద్ర నీతిసుధలోని 4, 5 పద్యములు రుచికి చదివాను. అంతే., ఆ సాంతము కావ్యమంతటిని చదివేశాను. కారణం — వారి కవిత్వములో వున్న నిరాడంబరత, తెనుగుదనం, ధార, కవిగారి వినయ మొక గొప్ప ఆకర్షణ అనుటయే.

'నవరసంబులొల్క చవిబుట్టు కబ్బము
వ్రాయలేను హితవు బలుకలేను' 3

అని వారన్నప్పటికి మెప్పును మననుండి ఈ గుణంతోనే సాధిస్తారు. ఈ గుణమెడనెడ చోటు చేసికొని కావ్యాన్ని రసమయం చేస్తుంది. జీవితానుభవం కవిత్వంగా మార్చిన వైనం వీరి కవిత్వంలో దర్శనమిస్తుంది. అందువల్లే వీరి కవితలో ఆర్ద్రయతాగుణం కల్గి కవితను శోభింప చేయడమేగాక గుండెను పిండేస్తుంది మచ్చుకు. 'కనులు కానలేక వినగ వీనులులేక' అని రాఘవేంద్రునికే సూటిగ ప్రశ్నవేసి ఆ మహాప్రభువునే కదిలించి మనకంట తడిపెట్టిస్తారు. ఇంతకంటే కవితకేం కావాలి? వీరి కావ్యం అనే పూచిన అవిసె చెట్టుపై తెలుగు నుడికారాలు, జాతీయాలు రామచిలుకలు వ్రాలినట్లు అగుపిస్తవి. పద్యాలన్ని రసగుళికలే. కలకండలో యే భాగం తీపి లేనిది? అలాగే ఈ కావ్యమంతా రసమయమే.

'పిలిచినంత పలుకు వేల్పు నీవె యటంచు 40

యని కవియొకచోట వేడుకొంటూ వారి భక్తిభావాన్ని, ఆవేదన వ్యక్తం చేస్తారు. ఆ కోర్కెను పరాత్పరుడు తీర్చుగాక!

# అంజలి

ఈ "రాఘవేంద్ర నీతిసుధ" నా అయిదవ రచన నేను పెద్దగా పేరు ప్రఖ్యాతులు గడించిన కవిని గాకపోయిననూ, కావ్యమర్మాలు తెలిసినవాడను గాకపోయిననూ—నా రచనలను విశేషప్రచారం కలుగజేయడానికి సహృదయులే ముఖ్య కారకులు. ఈ పుస్తకం వెలుగు చూడడానికి ముఖ్య ప్రోత్సాహకులు "శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కార్యనిర్వాహణాధికారులైన శ్రీ కుమారస్వామి రెడ్డిగారు - ప్రజాసంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు - సప్తగిరి ఎడిటర్, శ్రీ సుబ్బారావుగారు—వారి పాలకవర్గము. వదాన్యశేఖరులైనవారు గ్రంథ ముద్రణకు వలసినంత ధన సహాయ మొనరించినారు. ఇక—నా యీ కృతి—సమగ్రముగా—విని—పఠించి—సంతోషించి సహృదయ కవి పండితశేఖరులైన "శ్రీ పి. వి. శ్రీనివాసమూర్తిగారు (తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల ఆంధ్రోపన్యాసకులు) సమగ్రమైన పీఠికను వ్రాసియిచ్చినారు. డాక్టరు మల్లెల గురవయ్యగారు (మదనపల్లి, దివ్యజ్ఞాన కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షులు) శ్రీమతి పరిమ అరవిందగారు (తిరుపతి పద్మావతీ కళాశాల ఆంధ్ర శాఖాధ్యక్షురాలు) శ్రీమతి భాస్కర స్వర్ణాంబగారు—(తిరుపతి పద్మావతీ కళాశాల, ఆంధ్రోపన్యాసకురాలు) శ్రీయుతులు కె. వి. సుబ్బరామయ్యగారు (రిటైర్డు ఉపవిద్యా శాఖాధికారి తిరుపతి) వారి వారి అమూల్యాభిప్రాయాలను వ్రాసి యిచ్చినారు. నా యీ గ్రంథ ముద్రణకు ఆర్థికముగా విరాళము లిచ్చి చేయూత నిచ్చిన పెద్దలెందరో గలరు. ఈ నీతి సుధను—సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన చిత్తూరు శ్రీ బాలాజి ప్రెస్ వారికి, విరాళమొసగిన పెద్దలకు, ఈ సహృదయశేఖరులందరికినీ నా కృతజ్ఞతాంజలులు లర్పించుచూ - వీరిని కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహింపవలెనని ప్రార్థిస్తున్నాను.

— తిరుపతి - రామచంద్రకవి.

# ప్రీతితో విరాళము లిచ్చిన వదాన్యులు



| సర్వశ్రీ | రూ. |
|---|---|
| సిద్ధలింగారెడ్డిగారు, అగ్రికల్చరల్ కాలేజీ ప్రొఫసర్. | 300 |
| వేణుగోపాలరెడ్డిగారు, అడ్వకేటు-హైదరాబాద్. | 101 |
| కె. కృష్ణారావుగారు, అసిస్టెంటు యింజనీర్, విశాఖపట్టణం. | 72 |
| మహాకవి చేట్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు, తిరుపతి. | 58 |
| డి. వి. ఎస్. తిరుపతి రావుగారు, బి.ఎ.,బి.ఎల్. శ్రీకాళహస్తి. | 58 |
| వి. వరహాలు, రిటైర్డు కమర్షియల్ టాక్సు ఆఫీసర్, విశాఖపట్టణం. | 50 |
| బయ్యారెడ్డిగారు, భవానీనగర్-తిరుపతి. | 50 |
| టి. చంద్రశేఖరనాయుడు, కంట్రాక్టర్-తిరుపతి. | 51 |
| అక్కూరాంపల్లె చెంచురెడ్డిగారు | 25 |
| జి. శివరామమూర్తిగారు, శాంతి నగర్ - తిరుపతి. | 20 |
| దొందోలు బత్తిరెడ్డిగారు, సమితి వైస్‌ప్రెసిడెంట్ - తొండమనాడు. | 20 |
| జె. రంగయ్యగారు, S.T.P.S.V.C.H. School | 10 |
| జి. శ్రీనివాసులుగారు, అడ్వకేటు - శ్రీకాళహస్తి | 11 |
| కె. వి. రామచంద్రరాజుగారు, అసిస్టెంటు యింజనీర్ - పుత్తూరు. | 15 |
| కె. రామమూర్తిగారు, అడ్వకేటు - శ్రీకాళహస్తి. | 10 |
| పి. ఎస్. గోపాలకృష్ణదాస్‌గారు, అడ్వకేటు - శ్రీకాళహస్తి. | 10 |
| సయ్యద్ సాహెబుగారు, ఎక్సైజు యిన్‌స్పెక్టర్ - చిత్తూరు. | 10 |
| కృష్ణమనాయుడుగారు, ఆంధ్రోపన్యాసకులు - తిరుపతి. | 10 |

ఓమ్
శ్రీ రాఘవేంద్రాయ నమః

# రాఘవేంద్ర నీతి సుధ

శ్రీ వధూలలామ సీత గుణము మెచ్చి
శివధనస్సు ద్రుంచి చెల్వుమీర
సురలు మునులు పొగడ పరిణయంబాడిన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 1

శ్రీ గణాధిపతిని చిత్తమందున నిల్పి
కాలమునకు దగిన కబ్బ మొకటి
వ్రాయబూనినాడ వందిత గుణసాంద్ర
రామచంద్ర వినుత రాఘవేంద్ర 2

నవరసంబులొల్కు చవి బుట్టు కబ్బము
వ్రాయలేను హితవు బలుకలేను
బుధజనంబు మెప్పు పొంద సాధ్యంబౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 3

త్యాగరాజువంటి దైవ భక్తుడగాను
పోతనవలె కీర్తి పొందలేను
కైతలల్లి ముక్తిగాంచ నా తరమౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 4

ప్రసవ వేదనార్తి పడతి యెరిగినట్లు
కవితలల్లు బాధ కవి యెరుంగు
పరులకెట్లు దెలియు పైవారి కష్టముల్
రామచంద్ర వినుత రాఘవేంద్ర 5

## స్తోత్రము

శ్రీ రమావిహార శ్రితజనమందార
నిరుపమానశూర నిర్వికార
విజితమేరుధీర వేదాంత సంచార
రామచంద్ర వినుత రాఘవేంద్ర 6

అనుపమగుణగణ్య అద్భుత నైపుణ్య
దీనజన శరణ్య దేవగణ్య
రాజ రాజమాన్య రాజితసౌజన్య
రామచంద్ర వినుత రాఘవేంద్ర 7

భక్త పారిజాత పరిపూర్ణ విఖ్యాత
దైత్యకుల విఘాత ధర్మదాత
పాపరహిత మహిత భార్గవకుల జాత
రామచంద్ర వినుత రాఘవేంద్ర 8

చిన్మయాంతరంగ శ్రీకరసదపాంగ
పండరిపురి రంగ పాండురంగ
రమ్యగుణ శుభాంగ రాక్షస కులభంగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 9

పాలకడలి శయన భక్త జనావన
పాప పుంజహరణ పద్మనయన
నీలమేఘవర్ణ నిరుపమ గుణగణ్య
రామచంద్ర వినుత రాఘవేంద్ర 10

దేవ దేవ ఆదిదేవ రమాధవ
బుద్ధదేవ పరమ పూజ్యభావ
వాసుదేవ కేశవా రఘుకుల దేవ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 11

గరుడ గమన దనుజ గర్వ విభంజన
శేషతల్ప శయన దోషహరణ
కమల నయన విమల కౌస్తుభ భూషణ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 12

రామ దనుజ భీమ రవి కులాంబుధి సోమ
విబుధ సార్వభౌమ విమలనామ
పావన గుణధామ భద్రాద్రి రఘురామ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 13

శ్రీ రమావిలోల శ్రితజన పరిపాల
కనకచేల మధుర గానలోల
భవ్యలీల పరమపావన గుణశీల
రామచంద్ర వినుత రాఘవేంద్ర 14

సకలలోకవంద్య సాకేతపురివాస
శంఖచక్రధారి సచ్చరిత్ర
భక్తజన విధేయ భాగవతప్రియ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 15

ప్రార్థన

పాలకడలిమీద పవళించి పదునాల్గు
భువనములను బ్రోచు పూతచరిత
భక్తితో నుతింతు పాలించి రక్షించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర

ఆర్తజనుల బ్రోచి కీర్తి వహించిన
సప్తగిరి నివాస సారసాక్ష
భక్తిగుణ మొసంగి భవబంధముల బాపు
రామచంద్ర వినుత రాఘవేంద్ర

ఒక్కప్రొద్దులుండి ఒనరంగ పూజింప
సత్త్వగుణము లేదు శక్తి లేదు
భక్తవరుల కొసగు ముక్తి నొసంగవే
రామచంద్ర వినుత రాఘవేంద్ర

సర్వమయుడవనుచు సతతంబు వేడితి
మారుబల్కవేమి మాన్యచరిత
పాపకర్ముడనుచు పలుకవా? నా స్వామి
రామచంద్ర వినుత రాఘవేంద్ర

ఎంత వేడుకొందు హే రామ రఘు రామ
కావరావదేమి కలుషహరణ
యేలువాడవనుచు చాలగ నమ్మితి
రామచంద్ర వినుత రాఘవేంద్ర

గరుడ గమన రార పరమదయాకర
శరణు జొచ్చినాడ దురితదూర
చిన్ననాటనుండి సేవించుచుంటిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 21

మానసమున సతము మఱువక పూజింతు
దర్శనం బొసంగు దాసపోష
దిక్కు లేనివాడ మక్కువతో బ్రోవు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 22

ఏల బ్రోవవయ్య యెందుకు దయరాదు
మోము జూపవేల మోహనాంగ
మరుగు జొచ్చినాడ దురితంబులను మాన్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 23

ఏటుకొండ లెక్క యెంత వేడినగాని
చింతదీర్చవేమి చిద్విలాస
పంతమేలసామి భక్తుడ దయ జూపు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 24

రామ నన్ను బ్రోవు రాజిత గుణసాంద్ర
భక్తితో భజింతు ముక్తిదాత
యేమికాలమిద్ది హితులు శత్రువులైరి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 25

చెలిమి గోరుచుంటి సీతామనోహర
కలిమి బలిమిలేని కారణమున
కరుణ జూపి బ్రోవు సరగున పరమాత్మ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 26

కష్టమున్న వేళ గండముండెడివేళ
పిల్లవాండ్రు బాధ పెట్టువేళ
నైనగాని మఱువ నాశ్రిత జనబంధు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 27

ప్రాణముండు వఱకు భజియింతు నిరతంబు
ముక్తి నొసగవయ్య భక్తవరద
యేమి జన్మమిద్ది యేమి కర్మమిద్ది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 28

ఎచట నుందువయ్య యేకాంత రామయ్య
దర్శనంబు కొఱకు తలచి తలచి
దేవళాలు చుట్టు తిరిగి వేసారితి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 29

ప్రతికి నంత వఱకు భక్తితో గొలువంగ
బుద్ధి నిమ్ము నాకు భోగిశయన
నిత్య కృత్యమందు నియతినై పూజింతు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 30

కాలహరణమేల కష్టంబు లెడబాప
శోధకంబదేల చూపులేదు
వినఁటకైనగాని వీనులు లేవయా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 31

తల్లి తండ్రి గురువు దైవమీవె యటంచు
దలచుచుంటి సతము జలజనయన
బ్రోవ భారమేమి? పుండరీక వరద
రామచంద్ర వినుత రాఘవేంద్ర 32

భాగ్యహీనుఁడనుచు పరిహసించిన నేమి
బధిరుడనుచు పరులు పలుకనేమి
ముక్తికొఱకు నిన్ను భక్తితో పూజింతు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 33

పండ్లు రాలిపోయి ప్రాయముఁడిగిపోయి
రోగి యనుచు పరులు రోయువేళ
నైనగాని దలతు నపరాధముల మాన్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 34

బంధు మిత్ర వరుల బాధ పెట్టితిగాని
దాన ధర్మములను దలచనైతి
కలుషనాశ నన్ను కరుణించి కాపాడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 35

ప్రతిదినమ్ము మదిని పలుమాఱు సేవింతు
కరుణ జూపవేల గానలోల
గుహుని భక్తి మెచ్చి కోర్కె దీర్చితివిగా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 36

రామనామ మహిమ రంజిల్లె లోకాన
సర్వజనుల మదికి సమ్మతముగ
నెచట విన్నగాని యెంతయో శ్లాఘింత్రు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 37

కవిత గల్గె ననుచు గర్వింపగా లేదు
బిరుదు గల్గెననుచు ప్రేల లేదు
వేడుచుంటి మంచి పేరుతో బ్రతుకంగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 38

ధనము కోఱకుగాను ధ్యానింపగా లేదు
భూమి కోఱకుగాను పొగడ లేదు
కోరుచుంటి అతుల గుణధామ నినుజేర
రామచంద్ర వినుత రాఘవేంద్ర 39

పిలిచినంత పలుకు వేల్పు నీవె యటంచు
నమ్మి గొలుచుచుంటి నళిననయన
గాసి దీర్చి నన్ను కడతేర్చుమో సామి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 40

ఆ వే ద న

కనులు గానలేక వినగ వీనులు లేక
భక్తిబోధనలను బడయనైతి
హృదయ వేదనెటుల నిచ్ఛతో దీర్తువు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 41

నిముసమైన శాంతి నిల్వక హృదయాన
దిగులు పడితి బ్రతుకు తెరువులేక
దిక్కు నీవె యికను దీనజనోద్ధార
రామచంద్ర వినుత రాఘవేంద్ర 42

సర్వకాలమందు సంసార చింతతో
తపన పడుచు నిన్ను దలపకుండ
కాటికేగు వేళ కష్టాల పాలైతి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 43

అంత్యకాలమందు నాయాసమున జిక్కి
పడక మంచమందు బాధపడుచు
భక్తితోడ గొలుచు శక్తి పొందగనైతి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 44

ఆలుబిడ్డలందు ననురాగమెక్కువై
కర్మ మూలమైన కార్యములను
జేసి దిగులు జెంది చింతించుచుంటిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 45

పూర్వజన్మ కర్మ పుట్టిన దాదిగ
కనగ వినగ లేని కష్టములకు
నలిగి పరులచేత నవ్వుల పాలైతి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 46

క్రూర కర్మములను గొంకక జేసితి
తప్పు మాన్పి మంచిదారి జూపు
మేలు మఱువకుండ పూలతో పూజింతు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 47

గొప్ప తప్పుజేసి కులనింద పాలైతి
అతి దురాశవలన పతనమైతి
భక్త వరదనాదు పాపము తొలగించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 48

తప్పు పనుల గూర్చి చెప్ప సాధ్యంబౌనె?
వేనవేలు గలవు వివిధ గతుల
చెనటినైన నన్ను శిక్షించి రక్షించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 49

వివరములను దెలుప విసుగు గల్పించెడి
పాపకృత్యములకు పాలుబడితి
దండపాణి భయము దయ జూపి మన్నించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 50

తెలిసి కొంత తప్పు తెలియక యెంతయో
జేసి మదిని భయము జెందినాడ
చింతదీర్చి వేగచేర బట్టుము దేవ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 51

నీళ్ళపైన బుడగ నిల్వకుండిన యట్లు
మనుజ జీవితంబు మాయమౌను
యెఱిగి కూడ దొసగు లెన్నియో జేసితి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 52

వెఱ్ఱివాడ నగుచు పిత్రార్జితంబును
పాడు పనుల కొఱకు పాడుజేసి
దోషముల నెఱింగి దుఃఖించుచుంటిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 53

కలసిరాని పనులు కలకాలమును జేసి
ఆస్తి ధారవోసి ఆర్తి బాప
నమ్మి వేడుచుంటి నగుబాటు జేయకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 54

అతిదురాశచేత అప్పుల పాలయ్యు
మగువ సొత్తు నమ్మి మాటపడితి
తెలివి లేనివాడ దిక్కెవ్వరిక సామి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 55

కాపురంబునందు కష్టాలు మితిమీఱి
బంధుహితుల సొత్తు పాడుజేసి
లోకులకును సతము లోకువై పోతిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 56

బ్రతుకు తెరువు దప్పి బాధలు పడలేక
చేయదగని పనులు జేసినాడ
తప్పు నొప్పుకొంటి దయ జూపి మన్నించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 57

తీర్చి దిద్దలేక తెల్వి జెప్పగ లేక
నీతి తెలియు విద్య నేర్పలేక
వివిధ గతుల నాదు బిడ్డలఁ జెఱచితి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 58

తొలుత జేసినట్టి దుష్కృత్యముల గూర్చి
భయము జెంది భక్తి భావమందు
భక్త చరితలల్లు భాగ్యంబు గోరితి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 59

పరుల తప్పుబట్టి పద్యంబులను వ్రాయ
బూనుకొంటి నిపుడు భోగిశయన
యెటుల బ్రోవగలవొ యేకాంత రామయ్య
రామచంద్ర వినుత రాఘవేంద్ర 60

## దైవమహిమ

మహిని మూగవాడు మాటలాడు విరాన
కుంటివాడు గూడ కొండ కెక్కు
స్వామి కరుణ గలుగ సాధ్యమెయ్యది గాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 61

కూలివాడు గూడ కోట్లకు పడగెత్తు
ప్రజల మెప్పు బొందు ప్రబలముగను
దైవబలము గలుగ తన కసాధ్యమ్మేది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 62

బంధు హితుల దైనబలము లేకున్నను
దైవబలము సతము దవిలియున్న
వాని గెల్వగలరె? వసుధలో నెవరైన?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 63

పట్టుపురుగు చెట్లపై జేరి ఘనిలోన
మంచిపట్టు నిచ్చి మహిమ జూపె
సృష్టి చిత్రమెంచ కష్టమెవ్వరికైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 64

ఎట్టి కార్యమైన నీశ్వరార్పణమంచు
జేయునట్టివాడు జెందుముక్తి
భక్తిలేనిపనికి ఫలితంబు శూన్యము
రామచంద్ర వినుత రాఘవేంద్ర 65

## భాగవతులు

ఆ గజేంద్రు మొఱను బాగుగ గమనించి
బ్రోచితీవె నాడు పుణ్యమొసగి
వాదమేల నీదుభక్తుని ననుఁగావ
రామచంద్ర వినుత రాఘవేంద్ర

విదురుభక్తి మెచ్చి విందారగించియు
పాండవులకు సాయపడగ లేద
కావరావదేమి కరుణ జూపవదేమి
రామచంద్ర వినుత రాఘవేంద్ర

అటుకులీయ పిడికెడా కుచేలుడు నాడు
భక్తిమెచ్చి భాగ్యవంతుజేసి
ముక్తి నిచ్చితీవె భక్తుని గాపాడి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 6

దేవదాన వాళి తీరని తగవుకు
మోహినివలె రూపమును ధరించి
సుధ నొసంగితీవె సురల బాధలు బాప
రామచంద్ర వినుత రాఘవేంద్ర 6

గోపికల గురించి కోపతాపంబుల
తల్లిరోట గట్టి తగవులాడ
మద్దిచెట్ల గూల్చి మహిమ జూపితివీవు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 7

రాఘుచిలుకఁ బెంచి ప్రేమభాషలు నేర్పి
రామరామ యనుచు రమణి యొకతె
ముక్తి జెందలేద ? భక్తవత్సలహరీ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 71

కలహ భోజనుండు గానముతో వేడి
ధన్యుడయ్యె మౌని మాన్యుడయ్యె
శబరి యెంగిలిచ్చి సాధించె ముక్తిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 72

ఆ హిరణ్య కశిపుడానాడు ప్రహ్లాదు
దేవుడెచటనుండు తెల్పుమనగ
స్తంభమందు బుట్టి చంపితివా దైత్యు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 73

ఆలవిభీషణుండు చెలిమి గోరియు వేడ
శిష్టగుణము మెచ్చి చేరదీసి
రాజు జేసితీవు రయమున లంకకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 74

సక్కుబాయి భక్తి సమ్మోదమున మెచ్చి
కష్టములను బాపి కరుణతోడ
ముక్తి నొసగినావు మునిజన సేవిత
రామచంద్ర వినుత రాఘవేంద్ర 75

విమర్శ

అవనిలోనచూడ, అతివల కడకండ్లు
చెప్పతరమె పరమ శివునికైన
మానభంగములకు చానలు పాలైరి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 76

చెప్ప సాధ్యమగునె చిల్లరంగడి గూర్చి
సరకు లుండి గూడ ధరలు పెరిగె
దేశనాయకులకు తెలియదా ? యీ వార్త
రామచంద్ర వినుత రాఘవేంద్ర 77

సమ్మె లెక్కువాయె నెమ్మి తక్కువ యయ్యె
లంచగొండితనము మించిపోయె
మందిరోజు లింక నెంచగా వచ్చునే ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 78

బందిపోట్లు మిగుల బరితెగించిరిలను
కఠిన శిక్షలేని కారణమున
దుష్టజనుల తీరు తొలగించువారేరి ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 79

ఓటు కొఱకు వచ్చి ఓటిమాటనుఁజెప్పి
కాయ గెల్చుకొన్న కార్యవాది
ఓడిపోక మఱల నొప్పుగ గెల్చునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 80

చెప్పునదియు నొకటి చేయున దొక్కటి
హృదయమందు నొకటి యిమిడియున్న
యిట్టివారికెట్టి లిహపర సుఖమబ్బు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 81

పదవిరాని యెడల పార్టీలు నెలకొల్పి
ప్రజల హింసబెట్టి వాదులాడు
స్వార్థపరుల బ్రతుకు సత్కీర్తి నిచ్చునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 82

అత్తతోడ నసలు పొత్తులు పోకుండ
క్రొత్త పొయ్యి బెట్టు కోడలున్న
సారవంతమగునె? సంసారమెన్నగా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 83

యుద్ధభయము హెచ్చి యోధాన యోధులు
చేవలుడిగి భీతి జెందుచుండ
దేశమందు ప్రజకు దిక్కెవ్వరిక సామి?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 84

మారణాయుధాల బేరసారములకై
దేశనేతలేగు తీరుచూడ
లోకులకును మేలు చేకూరునా తండ్రి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 85

దొంగసొత్తు తెచ్చి దొరవోలె తెగనమ్మి
భాగ్యవంతు రీతిబరగువాని
తప్పు మాన్పవశమె ? ధరణీశుకైనను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 86

విగ్రహాల నెపుడు పెద్ద యుద్యోగులే
దొంగతనముజేసి దొరకుచుండ
దారి దోపిడీల తప్పు బట్టగనౌనె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 87

మంత్రి బంధువనుచు మాయ మాటలు జెప్పి
ప్రజల మోసగించి పట్టువడిన
గుణ విహీనుడెటుల కోర్కెను సాధించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 88

కల్లలాడువాడు కాంతలమ్మెడు వాడు
దొంగపనులు జేయు ధూర్తజనుడు
బుధుల దూరువాడు పొందునే ? సత్కీర్తి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 89

ప్రజల మేలుకొఱకు బాగుగ గమనించి
సాయపడెడి దొరలు చాల అరుదు
అట్టివారు వేగ అపకీర్తి పొల్గారె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 90

ప్రజల మభ్యపరచి పదవి సాధించియు
ప్రజల గోడు వినని పాలకులను
నమ్మువారలెవ్వరిమ్మహిలోపల
రామచంద్ర వినుత రాఘవేంద్ర 91

తంటమాట జెప్పి తగవులు గల్పించి
పరుల దుఃఖములకు బాధ్యుడైన
మొప్పె బ్రతుకు బ్రతుకే యెప్పటికైనను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 92

బంధు మిత్రులకును బాధ గల్పించెడు
తగవుబెట్టి పరుల ధనము దోచు
తనయుడేల? తల్లి దండ్రుల కిలలోన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 93

కష్టజీవి బ్రతుకు కనులార గాంచుచు
సాయపడక కీడు జేయునట్టి
నీతి లేనివాడు ఖ్యాతి వహించునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 94

పనుల నిత్తుమనుచు వనితల జెఱచిన
దుర్మ దాంధులైన ధూర్తజనులు
పాప వహ్నిలోన పడి బాధ జెందరా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 95

కట్నములను గోరి కాంతల హింసించు
ఘాతుకులకు తగిన నీతి గలదె?
యిట్టి కాలమందు నింతులగతి యెట్లు?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 96

పందితోలు దెచ్చి పలుమారు లుదికిన
రంగు మాయనట్లు వెంగళులకు
బుద్ధి తెల్పగలరె? సిద్ధులైనను గాని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 97

పరులఁ జంపి ధనము బాగుగ కాజేయు
హంతకులు ధరిత్రి నెంత వరకు
బ్రతుక గలరె? యముని బాధకు గురిగాక 98
రామచంద్ర వినుత రాఘవేంద్ర

పాప భీతిలేక పసిబిడ్డలను చంపి
శక్తిపూజజేయు చపల మతుల
కోర్కె దీరగలదె? కోటి జన్మలకైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 99

జంతుబలి యొసంగి జాతరలను జేయ
ముక్తి లభ్యమగునె? మూర్ఖులకును
జీవహింస నెట్టి దేవత గోరునే?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 100



మాంసభక్ష్యమందు మమతతో జీవుల
సాధుజంతువులను చంపి తినిన
భక్తి రుచి యొసంగ ముక్తి లభ్యంబౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 101

ఆడపడుచు లిండ్ల కగ్గిబెట్టు దురాత్ము
డాశదీర్చుకొనునె? లేశమైన
చేసినట్టి తప్పు శిక్షకు గురిజేయు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 102

గూటిలోనఁబెట్టి కూడుఁబెట్టియు పెంచ
పలుక గలదె? కాకి చిలుకలాగ
కుజను డెందుకైన సుజనుని పోలునే?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 103

నీరు మూట గట్ట నిల్వకుండిన యట్లు
ఆటబొమ్మ మాటలాడనట్లు
నీచగుణుని బూతు నిల్చునా? ధరలోన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 104

అందరాని ఫలము నాశించినట్టుల
వయసు పడుచు కొఱకు గ్రామ్యుడు
ముసలివాని ఆశ ముచ్చట దీర్చునా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 105

కలిమి లేనివాడు, వెలకాంతలను గోరి
ప్రాణసతిని సతము పస్తుబెట్టి
ధనమదాంధుగూర్చి, తప్పు బట్టగనౌనె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర

లంజె బిడ్డలకును, లాభంబు గల్పించి
సొంత బిడ్డలకును చింత గూర్చు
నీతి లేనివాడు, నెమ్మి వహించునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 1

సతిని హింసబెట్టి మతిచెడి వెలకాంత
పొందు గోరునట్టి బుద్ధిహీను
డెటుల ముక్తిజెందు హే పరమేశ్వర
రామచంద్ర వినుత రాఘవేంద్ర 1

అలిమాట వినుచు నన్నదమ్ముల సొత్తు
కొఱకు తగవులాడు క్రూరజనుడు
జగతిలోన గొప్ప నగుబాటు జెందడా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 1(

వనితచేత నింట భంగపడుచు గొప్ప
దొరతనంబు తనకు దొరికెననుచు
పరుల హింసబెట్టు దురితాత్ము బ్రతుకేల ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 11

దారకున్న ధనము, దౌరన్యముగ లాగి
వాదమాడి యోడి వాదులాడు
క్రూరజనుఁడు భువిని పేరు వహించునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 111

మగువబొల్లిమాటు, మక్కువతో విని
యిరుగు పొరుగు హితము నెరుగకుండ
కయ్యమునకు బూను కఠినుండు ఘనుడౌనె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 112

క్షణిక సుఖముకొఱకు కాంతలఁచంపెడి
రక్కసులకు చావురాక భువిని
నిల్వగలరె ? గొప్ప నిందకు గురిగాక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 113

పెద్దవారి హితవు పెడచెవి బెట్టుచు
చేయదగని పనులు చేయునట్టి
బుద్ధిహీనుడెటుల పొందును సత్కీర్తి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 114

నమ్మినట్టివారి సొమ్మును కాజేసి
పాపకృత్యములకు పాలుబడెడి
ఆ కృతఘ్ను బ్రతుకు నార్యులు మెత్తురా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 115

నీచుడెన్నిపనులు, నేర్చినప్పటికైన
నలుడగాడు గొప్ప తులువె గాని
ధనము గలుగ ఖలుడు, ధనపతి తానౌనె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 116

పట్టెడన్నమునకు, పరులిండ్ల కేగియు
భిక్షమెత్తుకొనెడి, బిచ్చగాని
కష్టమెరుగనట్టి కఠినుల బ్రతుకేల ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 117

స్వామిలేని గుళ్ల వాసిగాంచని యట్లు
భర్తలేని భార్య బ్రతుకు చెడును
వాడినట్టి పూవు పారవేసినలాగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 118

అందమున్నదనుచు డెందము లో నుబ్బి
మోహములకు మునుగు మూర్ఖజనుల
కాయువుడిగినంత అందము నిల్చునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 119

తోలుబొమ్మవంటి తుచ్ఛకాయము గాంచి
కామమోహములకు కట్టుపడిన
మనుజుడెట్లు పొందు, మహితమౌ ముక్తిని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 120

మానవతిని జెఱుప మాయతో యత్నించి
పరులచేతఁజిక్కి భంగపడిన
గుణవిహీను డెపుడు, కూలిపోవకయున్నె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 121

పతిని చావగొట్టి, పట్టుచీరలు గట్టి
పరపురుషునిగవయు వనిత బ్రతుకు
నవని మెచ్చినంత, యముడు మెచ్చునెఁగాంచి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 122

మగనిపైన నలుక మామపై జూపించి
మామ కన్నమిడని మగువ గూర్చి
యిరుగు పొరుగువారి కేవ గలిగింపదా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 123

వేదశాస్త్రములను, విశదంబుగా నేర్చి
బుధుడు శిష్యులకును బోధ జేసి
నీతి తప్పినంత ఖ్యాతి వహించునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 124

రాజమాన్యులైన రాజశేఖరులైన
భాగవతులునైన భక్తిలేక
పేరు బొందగలరే, వేయి జన్మలకైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 125

దైవభక్తివలన పావనగుణమబ్బు
దైవభక్తివలన తాపముడుగు
దైవభక్తి విడిన దరియేది ? ముక్తికి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 126

కవిత లల్లవచ్చు ఘనత గాంచగ వచ్చు
పేరు బొందవచ్చు విబుధ వరులు
భక్తి గుణములేక ముక్తిని గాంతురే ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 127

కుడితినీరు ద్రాగి గోవు పాలీయగా
పాలు ద్రాగి నరుడు మేలుబొంది
గోవులను వధింప గోరుట ధర్మమా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 128

సర్వశాస్త్రములను చదివినప్పటికైన
చావు మాన్పగలరె ? జనుల జగతి
నెట్టి విద్యలైన పొట్టకూటికి యౌను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 129

జీవికెంత బలము చేకూర్చినం గాని
జయముఁ బొందగలరె ? చావు మాన్ప
బలమదెంతయైన పని బాటలకెగాని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 130

రూపముండి బుద్ధి లోపించి నంతట
రూపమునకు దగిన ప్రాపుగలదె ?
రూపమునకు మించి కాపాడు సద్బుద్ధి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 131

రిపుల చెంత జేరి తపన బడుటకన్న
హితుల పంచజేరి బ్రతుకవచ్చు
కాని వాడు మేలు కలుగంగ జేయునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 132

తాపసులకునైన, ధర్మాత్ములకునైన
పండితులకు భక్త వరులకైన
కోపగుణములున్న పాపంబు గల్గదా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 133

భూతదయను మించు పుణ్యకార్యమదెద్ది
కోపమునకు మించు పాపమెద్ది
బుద్ధి బలము మించు సిద్ధబలమదెద్ది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 134

కలిమి గలిగినంత, కరుణ లేకుండిన
ఘనత కలుగగలదె? కఠినులకును
ఘనత యొసగనట్టి కలిమి వ్యర్థము సుమీ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 135

వేపచెట్టువేరు, వివిధరోగాలను
తొలివైచి పెద్ద మేలుజేయు
కఠిను డెందుకొదవు. కడుపు కూటికి చేటు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 136

ఈడు వచ్చి బిడ్డ లింటిలో కుమలంగ
పెండ్లి జేయలేని పెద్ద లిలను
వారకాంత పొందు గోరుట ధర్మమా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 137

జగడ మాడరాదు సతితోడ పగబట్టి
వట్టి తప్పు బెట్టి కొట్టరాదు
స్త్రీలు దుఃఖపడిన సిరియింట నుండునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 138

తృణముగా దలంచు ధీరుడు సంపద
మేరువుగ దలంచు గౌరవమును
గౌరవంబులేని కాపురమది యేల
రామచంద్ర వినుత రాఘవేంద్ర 139

బుధజనంబులేని పురము శోభిల్లునే
సుతులులేని గృహము చూడదగునె
మగువలేని గృహము నిగనిగలాడునే
రామచంద్ర వినుత రాఘవేంద్ర 140

మొదట యింటి గెల్చి, పిదప రచ్చను గెల్చు
బుద్ధిమంతుడిలను, పొందు సుఖము
యింట గెలువలేక నెవడు రచ్చనుగెల్చు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 141

దైవభక్తి గలిగి దాన ధర్మంబులు
శక్తి కొలది జేయ ముక్తిగలుగు
పేరు కొఱకు జేయు క్రూరునకెటు గల్గు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 142

గ్రుడ్డివాని, కర్మరోగముండెడివాని
చెవిటివాని. మొండిచేయివాని
చింత యిట్టిదనగ, శేషుని తరమౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 143

గుళ్లి గోపురాలు గొప్పగా కట్టించి
ముక్తి జెందినట్టి భక్తవరుల
పేరు మరువగలరె? విశ్వంబులో నరుల్
రామచంద్ర వినుత రాఘవేంద్ర 144

రౌతు మెత్తనైన, రయమున పోవునా?
గుఱ్ఱమెంత బలము గూడియున్న
మగడు చుల్కనైన: మగువెట్లు గమనించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 145

సాధుమాత కేల ? సంసార సంగతి
భక్తవరుల కేల, వైభవములు
శక్తిపూజ కేల ? చంటిబిడ్డల బలి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 146

ఉత్తమాటలేల ? యున్నతోద్యోగికి
మోహబంధ మేల ? మునివరులకు
జీవహింసలేల ? దేవతార్చనలకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 147

అప్పుఁజేసి జేయునాడంబరములేల ?
విందు భోజనమున భేదమేల ?
పదవి కొఱకు పరుల బాధపెట్టగ నేల ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 148

వ్రాయ చదువలేని వాని జన్మమదేల ?
భక్తిలేనివాని భజన యేల ?
గుణమొసంగలేని గురుబోధ యేలరా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 149

శాంతి గూర్పలేని సతి యున్న ఫలమేమి ?
హితము వినని యట్టి సుతుడదేల ?
పరుల జెఱచువాని భాగ్యమదేలకో ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 150

పిచ్చివానికేల ? వేదోపదేశము
మడ్డివానికేల ? మంచి మగువ
కఠిన చిత్తుకేల ? కనకాభిషేకము
రామచంద్ర వినుత రాఘవేంద్ర 151

మునివరేణ్యకేల ? భోగ భాగ్యంబులు
భజనపరులకేల ? కుజన గోష్ఠి
ముసలివానికేల ? మోహము స్త్రీలపై
రామచంద్ర వినుత రాఘవేంద్ర 152

త్యాగనిరతిలేని, ధనవంతు ధనమేల ?
దైవభక్తిలేని తనువదేల ?
మేలు గోరనట్టి మిత్రబంధువులేల ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 153

అట్టహాసమైన ఆటోప మది యేల ?
ప్రజల గోడు వినని పాలకులకు
గాంధి తత్త్వము లను, గమనించుటయె లెస్స
రామచంద్ర వినుత రాఘవేంద్ర 154

కంచికేగినంత ఖరము గుఱ్ఱముగాదు
మధుర కేగ కోతిమనిషిగాదు
యాత్రజేసినంత, అల్పుడనఘుండౌనె ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 155

మంచి చదువు చదువు, మనుజుండు సుఖమొందు
సర్వసమ్మతముగ సంతతంబు
చదువు లేనివాడు సత్కీర్తి జెందునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 156

అడిగినట్టి పేదకన్నము బెట్టక
అడగనట్టి ధనికి అన్నమిడిన
పారవేయుగాని. పరితృప్తి జెందునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 157

రోగియైన పతిని రోసెడి కోమలి
మారు మగనిపైన మమత జూప
సాటివారిలోన సత్కీర్తి పొందునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 158

బుద్ధిహీనులైన పుత్రుల గన్నట్టి
తల్లిదండ్రులకును ధరణిలోన
చింతయయినగాని సుఖము లభించునా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 159

సుజనులున్నచోట, కుజను డున్నంతనే
బుద్ధిమంతుడగునే? భువిని తాను
కోయిలున్నచోట గ్రుడ్లగూబ విధాన
రామచంద్ర వినుత రాఘవేంద్ర

తలలు బోడిఁజేయ దైవము మెచ్చునా ?
జీవహింసఁజేయు చెనటులకును
హింస మానినంత యిష్టదైవము మెచ్చు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 161

కుటిల మతికి మేలు కొండంత జేసిన
నుంత యయినగాని సుఖము గలదె ?
కొద్ది మేలుకైన గుణవంతు డుప్పొంగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 162

కాకి పలుకు విన్న కాఠిన్యముగనుండు
చిలుక పలుకు విన్న కలుగు ప్రేమ
కఠిన వచనములకు గౌరవ మబ్బునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 163

గంగిరెద్దువోలె గడప బట్టక యుండి
పనికి పందయయిన పలవ కన్న
దున్నపోతు మేలు దుక్కిని దున్నునే
రామచంద్ర వినుత రాఘవేంద్ర 164

కొలత బత్తెమిచ్చి కోడలితో అత్త
తగవు లాడుచుండ ధర్మమగునె ?
నీతిలేక వట్టి నేరము మోపుచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 165

కాలు విరిగినంత కట్టుగట్టి బిరాన
నయము సేయవచ్చు భయములేక
నోరు జారెనేని దారేది నిలుపంగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 166

మౌనివరులచెంత మహితోక్తులను విని
పుణ్యపురుషువోలె బోధజేసి
ఆచరింపడేని అనఘుండు తానౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 167

భక్తికొఱకుగాను బూటకంబులుఁ బల్కి
కాలమొక్కరీతి గడపుచుండు
తిండిపోతులకును తెల్వి జూపవదేమి?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 168

హృదయమందు దొసగు లెక్కువగాజేసి
పరుల మోసగించు నరుల కథల
లోకు లెరుగనంత లోకేశు డెరుగడే?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 169

ఆశచేత పరుల కపకారములు జేసి
భక్తవరునిలాగ వరలుచుండ
పరులెరుంగనంత బ్రహ్మ యెరుంగడా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 170

పనికిరాని పనులు పదివేలు కంటెను
ఒప్పదగినకార్య మొకటిచాలు
పనికిరాని పనులు ఫలితంబు నిచ్చునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 171

కోట్లకు పడగెత్తు కోటీశ్వరులునైన
తపనపడుచునుంద్రు ధనము కొఱకు
నెంతయున్నగాని సంతసింపరదేల
రామచంద్ర వినుత రాఘవేంద్ర 172

జాతిభేదమెంచి జగడాలు కొనితెచ్చి
కొంపకగ్గిబెట్టు క్రూరజనుల
కాయువుడిగినంత యముడు మన్నించునా ?
రామచంద్రవినుత రాఘవేంద్ర 173

కలసి వచ్చెననుచు గర్వించి సొత్తును
పాడుజేయునట్టివాడు భువిని
కాటికేగువఱకు కూటికల్లాడడా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 174

హితవుమాటఁజెప్పి యెంత బోధించిన
వేశ్యపడుపు వృత్తి విడువ దెపుడు
పాలుబోసి పెంచ పాము మేలెంచునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 175

పూర్వజన్మసుకృత భోగ భాగ్యములుండి
పరధనంబుగోరు వాని కన్న
ముష్టిచెట్టుమేలు మూలికలకు నొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 176

ఆదరించి పరుల నతిథి ననాధుల
చేరదీయలేని చెనటుకన్న
జంతుశాలలోని శార్దూలమే మేలు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 177

ఈడురాని పాప యింటిపనికి పోయి
మానభంగమునకు మైనమాయె
చెఱచినట్టి దొరకు మరియాదలుండునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 178

చిల్లికాసుగూడ పిల్లలకీయక
ధనము కూడబెట్టి దాచువాని
ధనము దొరలకౌనొ ? ధాత్రిలో దాగునో
రామచంద్ర వినుత రాఘవేంద్ర 179

కలిమి యున్నవాడు గాదె దీయక ముందె
పేదవాడు జచ్చు వేదనలకు
కలిమి యున్నవారు కష్టంబు గనరేల ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 180

తీర్థయాత్రలనుచు, తెంపుగ పయనించి
దానధర్మమిడక, తాను దినక
ధనము దాచువాని, ధనము శాశ్వతమౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 181

దాన ధర్మములకు, ధనము కొద్దిగనీక
ధనముకూడబెట్టు ఘనుని ధనము
దొరలకగునొ? దారిదోపిడీల కగునొ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 182

ధనము లేనివాడు, దానముచే వెల్గు
దానమిడనివాని, ధనమదేల?
ధనముకన్న ఘనిని, దానమె గొప్పది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 183

సతిని మెచ్చుకొనుట, సంసారశాంతికే
సుతుల మెచ్చుకొనుట, హితవు కొఱకె
మేలుగూర్పలేని, మెరమెచ్చు లేలకో
రామచంద్ర వినుత రాఘవేంద్ర 184

ఆస్తియుండిగూడ, అప్పు లెగురగొట్టు
తప్పు మనిషి చర్య ధాత్రిలోన
నెవ్వరొప్పుకొంద్రు? యెగతాళి జేయక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 185

మంచివారి చెల్మి, కొంచెమైనను చాలు
ఖలులమైత్రి వేలు, కలుగనేల?
భక్తి యొకటె చాలు, ముక్తియొసంగును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 186

నికరమైన రత్నమొకటియైనను చాలు
రాసి యేల? గిల్టురాళ్ల నగలు
బుద్ధిమంతుడైన పుత్రుడొక్కడు చాలు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 187

ఆవు పాల నిచ్చు ననుచు మదిని నమ్మి
పిండకున్న పాలు కుండబడునె?
భక్తిగుణము లేక ముక్తిప్రాప్తంబౌనె?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 188

కాటికేగువాని, కాయముపై బడి
యేడ్చుచుంద్రు నరుల దేల? సామి
బ్రతికినపుడు సతము రాపిడిఁజేయుచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 189

నీతి లొల్కువాడు, నీతి కోవిదుడౌనె?
ఆచరింపడేని, అవనియందు
చెప్ప నేర్చుగాని, చేయ నేర్వడుగదా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 190

పరులకెగ్గుఁజేయ పట్టుబట్టెదరేల?
తమకు గల్గు ముప్పు దలచకుండ
పరుల జెఱచు నరుల పాపంబు పండదా?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 191

కోటి వైద్యులైన, గొప్ప మందు లొసంగి
మరణరోగములను మాన్పగలరె?
ప్రాణమున్న యపుడె, భక్తి భజన లొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 192

భూతదయను మించు పుణ్యకార్యములెవ్వి
కోపమునకు మించు పాపమెద్ది
బుద్ధి బలము మించు సిద్ధబలము లెవ్వి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 193

పులినిఁజూచిమేను, కలయఁ గాల్చుకొనంగ
బోరియుగాని నక్క పులియుఁనగునె?
అజ్ఞుడెపుడు గాని విజ్ఞుండు గాలేడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 194

అల్పబుద్ధివాని, నాశ్రయించుటకంటె
కొంగుబట్టి భిక్ష గొనుట మేలు
అది అసాధ్యమైన ఆత్మహత్యయె తగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 195

విద్య తక్కువైన యుద్యోగు లీనాడు
గొప్పవారి బుద్ధి గుణమెఱుగక
కించపరచతగునె ? మంచినెఱుంగక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 196

మంచివిద్య చదువు, మనుజుండు సుఖమొందు
సర్వసమ్మతముగ సంతతంబు
విద్యలేనివాడు, విఖ్యాతి జెందునా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 197

గురుభయంబులేక, గురుని దూషించెడి
దుష్టజనుడు భువిని భ్రష్టుడగును
గురుని కరుణలేక, పరమార్థ మబ్బునా ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 198

గురుడుఁజూచుచున్న గొంకక గర్వియై
పొగనుఁబీల్చునట్టి బుద్ధిహీను
విద్య గొప్పదైన పెద్దలు మెత్తురే ?
రామచంద్ర వినుత రాఘవేంద్ర 199

చదువులెన్నియున్న సత్కీర్తి నిచ్చునా ?
దారిదోపిడీల క్రూరులకును
మంచిగుణములున్న, మాన్యత చేకూరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 200

విద్యార్థి

బడికి వేళకేగి కడుభయ భక్తితో
పాఠములను చదువు బాలకుండు
గురుని మించినట్టి కోవిదుడై చెల్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 201

గురుని దైవముగను, గుర్తించి భక్తితో
గురుని సేవ జేయ గోరువాడు
వివిధ విద్యలెల్ల వెంటనె గడియించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 202

చిన్ననాట గురుని శిష్యత్వమును బొంది
సతము శ్రద్ధతోడ చదువువాడు
పండితాఢ్యుడగుచు ప్రజల మెప్పు వహించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 203

విద్యలేక యున్న సద్యోగ మబ్బక
గొప్పవారికైన ముప్పు నిచ్చు
విద్యకన్న గొప్ప విశ్వంబులో లేదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 204

చదువుమీద ఆశ చాలించు విద్యార్థి
కాసుజేయలేక కర్మవశత
బ్రతికినంతవరకు రాపాడుసర్వుల
రామచంద్ర వినుత రాఘవేంద్ర 205

తప్పొప్పులు

మంచిజేయు టొప్పు వంచించుటది తప్పు
తపము జేయు టొప్పు తార్పు తప్పు
భజన సేయు టొప్పు పరదూషణము తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 206

జీవహింస తప్పు దైవ చింతన యొప్పు
పరుల జెఱచ తప్పు భక్తియొప్పు
తప్పు లెంచ తప్పు తన తప్పెరుగుటొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 207

పుణ్యకార్యములకు బుద్ధి గల్గుట యొప్పు
పాప కృత్యములకు బడుట తప్పు
దైవభక్తులకును సేవ జేయుట యొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 208

పరమ భాగవతుల పల్కులు వినుటొప్పు
క్రూర జనుల మైత్రి గొప్ప తప్పు
కాపురంబునందు కలసియుండుట యొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 209

పెద్దవారి జూచి వెక్కిరించుట తప్పు
మౌనివరుల హితవు మాటలొప్పు
యింతి నెపుడు చిత్రహింస బెట్టుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 210

దేశభక్తజనుల తెగనాడుటది తప్పు
దుష్టజనుల మైత్రి తొలగుటొప్పు
విగ్రహాలదొంగ వెధవ చెల్మియు తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 211

దేశభాషలెల్ల తెలియగోరుట యొప్పు
శిల్పకళకు గొప్ప సేవ యొప్పు
విబుధ వరుల చెంత విద్య నేర్చుట యొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 212

కానివారితోడ కలసియుండుట తప్పు
మంచిగుణమువాని మైత్రి యొప్పు
జాతి మతము గూర్చి జగడమాడుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 213

దుండగులకు శిక్ష తొలగించుటది తప్పు
మద్యపానములను మానుటొప్పు
సుంతయయిన దొంగసొత్తు గొనుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 214

దారిదోపిడీల జేరదీయుట తప్పు
దైవ చింతనలకు తనువు యొప్పు
చేతగాని పనులు చేయబూనుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 215

రాజకీయములకు రంగు మార్చుట తప్పు
త్యాగనిరతికొఱకు ధర్మమొప్పు
అందరాని ఫలము నాశించుటది తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 216

కాటకమున ప్రజల గాసి దీర్చుట యొప్పు
తనదు తప్పు తెలిసికొనుట యొప్పు
సర్వజనులకొఱకు సాయపడుట యొప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 217

జారిణులను గోర సాహసించుట తప్పు
సతికి మేలు గల్గు సాయమొప్పు
ఆడబిడ్డసొత్తు లపహరించుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 218

నీతి బోధనలకు నెపము జూపుట తప్పు
దాన ధర్మములను దలచు టొప్పు
భక్తవరులతోడ వాదులాడుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 219

గుళ్ల గోపురాలు కూల్ద్రోయుట తప్పు
దుష్ప్రవర్తనలకు తొలగుటొప్పు
దేవతార్చనలకు జీవహింసయు తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 220

దుష్టజనుల చెల్మి కిష్టపడుట తప్పు
శిష్టజనుల చెల్మి జేయు టొప్పు
అనపరాధులిండ్ల కగ్గిబెట్టుట తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 221

అత్తగారిసొత్తు కాశపడుట తప్పు
స్వార్జితమున బ్రతుకు సాగుటొప్పు
అలియార్జితమున కాశించుటది తప్పు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 222

అతిధనాశవలన ఆరాటమెక్కువౌ
ఆశ చెడ్డదైన అపదౌదవు
ఆశ మంచిదైన అఘముల హరియించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 223

ఆశ దుర్గుణముల కలవాటు పడుచుండు
ఆశ మోహములకు నతిశయిల్లు
ఆశయే పిశాచియైపట్టి పీడించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 224

ఆశ విడువకున్న అనఘుండు కాలేడు
ఆశ వలన దుఃఖ మధికమగును
ఆశ లెక్కువైన అలసట లెక్కువౌ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 225

లోకపు తీరు

ధనము లేనివాడు తల్లి తండ్రి గురుండు
సతియు సుతుల చయము చావుగోరు
బంధు మిత్రులెల్ల పల్కరింప రసలు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 226

ధనముఁగలియున్న తనవారు మేమంచు
కానివారుగూడ కలియుచుండ్రు
ధనము లేనివాడు తనవారె దూరగుల్
రామచంద్ర వినుత రాఘవేంద్ర 227

ధనముఁ గల్గువారు ధనమున్నవారికే
సాయపడుచునుండ్రు సర్వ గతుల
కడలి కలియు నదుల గతుల విధంబున
రామచంద్ర వినుత రాఘవేంద్ర 228

కుక్క నక్క జగతి నొక్క పోలికను డు
పోల్చిచూడ వాటి బుద్ధివేరు
మృగములందు మంచి మృగములు వేరయా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 229

కంచు కనకమొక్క కాంతితో దనరారు
వరసి చూచినంత ధరలు వేరు
సూరి జనములందు సుకవులు వేరయా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 230

నిమ్మపండు జూడ నిగ నిగలాడును
తోలువలచి తినిన చాల పులుపు
కపటవేషధారి కన్పించు నీ రీతి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 231

మిరపపండుజూడ మిలుమిట్లు గొల్పును
నోట బెట్టినంత ఘాటు నిచ్చు
వారకాంతవలపు సారమీలాగయా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 232

వేశ్య రంకుతనము విటకా డెఱుంగును
భార్య మంచితనము భర్త యెఱుగు
భక్తవరుని గుణము పరమేశు డెఱుగును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 233

భటుల గొప్పతనము పరిపాలకుం డెఱుగు
ప్రభువు గొప్పతనము ప్రజలెఱుంగు
తండ్రి మంచితనము తనయుం డెఱుంగును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 234

వయసు బిడ్డతోడ పయనించు తండ్రిని
పరులుఁజూచి తప్పు బట్టినంత
నిజము దేవుడెఱుగు నింద లోకమెఱుగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 235

అంటరానితనము కంటకమొనగూర్చె
ఆర్యకథలు మారనందు వలన
మట్టి బొమ్మలకును మట్టి యొక టేగదా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 236

నిప్పు కొంచెమైన నిర్మూలనముఁజేయు
పడిన చోటుగాక ప్రాంతమెల్ల
చిన్న చీడపురుగు చెట్ల జెరచు ఖంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 237

అసలు వడ్డి జేర్చి అప్పుదీర్చిన గాని
సంతసించకుండ షావుకారి
వడ్డి తక్కువనుచు వడ్డి యెక్కువ గోరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 238

తన బడాయిఁదెలుప తనవారి తప్పుల
నొప్పుగాను చెప్పు తప్పు మనిషి
గొప్ప గోరి పరుల యొప్పున కోర్వక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 239

కలిమిఁగల్గువాని గౌరవంబును గాంచి
బూతుమాటనైన పొగడు చుంద్రు
లేనివాని హితవు లెక్కింప రెవ్వారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 240

కట్టుకొన్న భార్య గయ్యాళి గంపైన
విడువలేనివాడు వెఱ్ఱివాడు
కామవాంఛకొఱకు కలసియుండునె గాని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 241

రచ్చ కీడ్చునట్టి రాకాసి సతియైన
బ్రతికి బట్టి కట్టు భర్త భువిని
పాముపడగనీడ పడియుండి నట్లౌను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 242

సద్దు మణగినంత సానికొంపల కేగు
వయసువారు ముసలివారుగూడ
భాగవతులులాగ వర్తిల్లు చున్నారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 243

వేళకు నరుదెంచు భిక్షుగానిని గాంచి
వేళగాదటంచు భిక్షమిడక
కఠిన చిత్తురాలు కసరి పొమ్మని చెప్ప
రామచంద్ర వినుత రాఘవేంద్ర 244

పందికొక్కు జేరి భవనంబు జెరచును
కోతిపిల్లజేరి కొమ్మ జెరచు
పాలసుండుజేరి భక్తుల జెరచురా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 245

మత్తగజముపైన మావటీడున్నట్లు
తెలివి యున్నవారు దేశమందు
ముఖ్య పదవులందు మోపుగనున్నారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 246

పనికిమాలినట్టి బంజరు భూమికి
యుద్ధములకు బూని యోధులెల్ల
కోట్లు కర్చుఁబెట్టి కొట్లాడు చున్నారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 247

అన్నిరంగములను అవినీతి పెంపొంది
జారచోరవృత్తి సాగుచుండె
బుద్ధి మందగించి ప్రౌఢలయందున
రామచంద్ర వినుత రాఘవేంద్ర 248

భువిని దేవుడీయ పూజారి వరమీక
గడపుచుండె కాలకర్మ మనుచు
నెంతవారలైన నిబ్బంది పడుచుండ్రు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 249

నిజముఁజెప్పువాని నిందించుచుండగ
బొంకులాడువాని భువిని పొగడ
నిజము జెప్పవెరచు సుజనుడైనను గాని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 250



భార్యకైనగాని బంగారు[?]సను
భంగపడనివాడు వసుధ[యం]దు
లేడు లేడు నేడు వాడ వ[?]ల జూడ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 251

తాంగ్రడ చెట్టునందు తప్పు మనిషియందు
రావి చెట్టునందు రకరకముల
భువిన లక్ష్మియుండి పోరాడునట జేర
రామచంద్ర వినుత రాఘవేంద్ర 252

సత్యవంతులందు సజ్జను లందును
కీర్తివంతమైన గృహములందు
లక్ష్మివెలుగుచుండు లావణ్యముప్పార
రామచంద్ర వినుత రాఘవేంద్ర 253

అందినపుడు సిగయు నందనప్పుడు కాళ్ల
బట్టుకొంద్రు ఖలులు గట్టిగాను
సొంతకార్యములకు సుంత నీతియులేక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 254

బ్రతికి చెడినవాని బాగునుగోరక
కలిమి గల్గెననుచు గర్వపడుచు
గడచి బ్రతికినట్లు ఖలుడు నీతులు బల్కు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 255

పాతగుడ్డచించి పారవేసినలాగ
కసరుచుంద్రు ఖలులు గర్వముగను
ముసలివారి జూచి రుసరుసలాడుచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 256

తల్లి దండ్రులెంత ధనవంతు లైనను
విధికి లొంగి కొడుకు పేదయైన
కథలుఁజెప్పుకొన్న కడుపు భగ్గనమండు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 257

జారచోరనరుల సాంగత్యమును జేయ
గొప్పవారికైన ముప్పు గలిగి
నీచ గుణములబ్బ నిందకు గురిజేయు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 258

నీచునకును విషము నిలువెల్ల నుండును
కాముకునకు విషము కనుల నుండు
పాములకును విషము పండ్ల యందుండును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 259

చాలినంత కూలి మేలు గోరుచు నీక
కూలివాని కడుపు గొట్టు ఘనుడు
ధర్మమెరుగలేడు ధరలోన చూడగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 260

కాపురమున నొక్క కవివర్యు డుండిన
కాపురమున కెంతొ ఘనత గలుగు
దేవళంబులోన దేవు డున్నట్టుగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 261

పట్టణమున గొప్ప పండితు డుండిన
వాడవాడలతడు వాసి కెక్కు
విపినమందు గంధవృక్ష ముండిన యట్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 262

గ్రామమందు నొక్క గజదొంగ యున్నచో
గ్రామమునకు గొప్ప కష్టమొదవు
కుసుమవనములోన క్రూర మృగము భంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 263

హితులలోన నొక్కహిత శత్రువుండిన
హితుల జెఱచువాని బ్రతుకు కొఱకు
సాధుమృగములందు జంబూక మున్నట్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 264

నీతి లేనివాడు నీతి కోవిదులను
కలిసియుండినంత ఘనుడుగాడు
చెట్ల పొదలోన చీడపురుగు భంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 265

గుణవిహీను నమ్మి కొంపలో జేర్చిన
వంశ గౌరవంబు భ్రంశమగును
కొరివితోడ తలను గోకి కొన్నట్టుగ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 266

చెడ్డగుణమువాని చేరదీసిన వాడి
కీర్తిచెడు పేగాళ కీడు గలుగు
కౌరవులను శకుని కాటి కంపినయట్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 267

బుద్ధి హీనజనుడు బుద్ధిమంతుండును
పుట్టి పెరుగుచుంద్రు భూమి మీద
కంపచెట్టుచెంత గంధపు తరు భంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 268

కూలివానిబిడ్డ గుణము నెరుంగక
తూలనాడుచుంద్రు ధూర్తజనులు
కాకిబిడ్డగూడ కాకికి ముద్దగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 269

హితుని యింటికేగు మతిమంతునైనను
యిరుగు పొరుగు జూచి యీర్ష్య జెంది
నిజమెరుంగలేక నిందించు చుందురు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 270

కాల వైపరీత్యము.

మంత్రులెందరైన మారినప్పటికైన
దేశ పాలనంబు తీరుచూడ
మారలేదు మంచిమార్గాన భువిలోన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 271

శాసన సభలోని సభ్యుడనుచు మారు
పేరు(జెప్పి ఘనుల బేలపుచ్చి
ధనము దోచుకొన్న మనిషి కాలంబాయె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 272

ఓట్ల కొచ్చినపుడు కోట్లు ఖర్చు భరింప
దేశనాయకులకు తెంపు గలిగె
కాటకమున ప్రజల గాసి దీర్పగలేక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 273

పదవి గోరి నరుడు పరులిండ్ల కేగియు
వెఱ్ఱివానిలాగ వేడుకొనుచు
పదవి రానియెడల పలుమారు దూషించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 274

ప్రజల బాధ గనని పాలకు డీనాడు
ఘనత జూప కోట్లు ఖర్చుబెట్టి
పదవి తక్కువైన ప్రభువు పర్యటనకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 275

దేశపాలనంబు దినగండ మగుచుండ
ప్రజల కెగ్గుగలిగి భయము గలిగె
రాజనీతిలేని రాబందు లెక్కువై
రామచంద్ర వినుత రాఘవేంద్ర 276

ప్రజల మేలు కొఱకు పాటు పడగలేని
దొరలకాలమాయె ధరణియందు
కరుణ గలిగి ప్రజల కష్టమీడేర్చుమో
రామచంద్ర వినుత రాఘవేంద్ర 277

భయము హెచ్చె నేటి పరిపాలనముతీరు
వినగ వినగ మదికి విసుగు గలిగె
హింసలెక్కువాయె నెందెందు చూచిన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 278

పాలకులకు నెల్ల భాగ్యంబు ఫలియించె
లంచగొండులకును లాభమొప్పె
లోకులకును సుఖము లోపించిపోయెను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 279

వంచకులకు గొప్ప వైభవంబులు గల్గె
మంచివారి బ్రతుకు మందమయ్యె
నెచట విన్నగాని యిటువంటి వార్తలే
రామచంద్ర వినుత రాఘవేంద్ర 280

హంతకులకు బలము అతిశయించుటవల్ల
సజ్జనులకు బలము సన్నగిల్లి
కొల్లగొట్టుచుండ్రి పల్లెలు పట్నాలు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 281

మానభంగములును మద్యపానంబులు
సాధు దూషణములు సంగరములు
హద్దుపద్దులేక నధికమౌ చుండెను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 282

తప్పు సాక్ష్యములును దైవ దూషణములు
కపటవేషములును విపులముగను
తీవ్రమగుచు భువికి తిప్పలు వాటిల్లె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 283

బూదగాండ్ర బెడద చోరుల బెడదయు
మోసగాండ్ర బెడద ముప్పుగూర్చి
చెప్పుకొనుట కైన యెప్పుడు హృదయంబు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 284

వెట్టిచాకిరిలను గట్టిపడుచు నుండె
అడుగువారులేక నన్నిగతుల
పేదవారి బ్రతుకు వేదన పాలాయె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 285

అధిక వర్షమొకట నారాటమును గూర్చ
వానలేక యొకట పైరులేక
పజలు కష్టములకు పాల్పడుచున్నారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 286

వరదవచ్చి గంగపాలాయె లోకము
సరకు ధరలు హెచ్చి కరువు వచ్చె
వానలేక యొకట బ్రతుకు భారంబాయె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 287

కడవనీటికొఱకు కన్నీరుగార్చుచు
అమడేగుచుండి రాడవారు
నిట్టికాలమందు నెవరికి సుఖమబ్బు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 288

పొట్టకూటికొఱకు పొలము లమ్మినగాని
కడుపు నిండపూట గడపలేక
వాడవాడప్రజలు వలసపోయిరి సామి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 289

విద్యయుండిగూడ పెండ్లిండ్లు గానట్టి
వధువు లెక్కువైరి వసుధయందు
కాలదోషమేమొ కష్టాలు మితిమీరె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 290

మూర్ఖ లక్షణము

మకరినోట మణిని పెకలింపగావచ్చు
సూర్యగోళమెల్ల చూడవచ్చు
మూర్ఖజనుని మదిని మురిపింపగా రాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 291

వెఱ్ఱివానికయిన విద్య నేర్పగవచ్చు
క్రూరమృగముతోడ పోరవచ్చు
దుర్మదాంధువృత్తి తొలగింపగారాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 292

సూర్యగోళమునకు చొచ్చితిరుగవచ్చు
సింహమునకు బుద్ధి జెప్పవచ్చు
నిర్దయాత్మకునకు నీతితెల్పగరాదు
రామచంద్రవినుత రాఘవేంద్ర 293

సాగరంబు లోతుకేగి చూడగ వచ్చు
ఆకసమును చేత దాకవచ్చు
పిరికివాని మదిని తరలింపగారాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 294

బుద్ధిబలముచేత పులుల జంపగవచ్చు
అతిగ విషము త్రాగి బ్రతకవచ్చు
ఖలుని బుద్ధిమాన్పగా దీశ్వరునికైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 295

పరధనంబుకొఱకు మరియాద గోల్పోయి
తప్పు సాక్ష్యములను జెప్పువాడు
నీతి తెలియలేక నిందకు పాల్పడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 296

కలసివచ్చె ననుచు గర్వించి సొత్తును
పాడుజేయునట్టివాడు భువిని
కాటికేగుపఱకు కూటికల్లాడును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 297

ప్రాయముడిగినపుడు భక్తి గుణములేక
తపనపడుచు ఖలుడు తనువుపైన
పాడుపనులు జేయు వ్యామోహమునుఁజెంది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 298

కరుణహృదయునైన కఠినాత్మునైనను
యొక్క రీతి పోల్చు తిక్కవాడు
మంచికంటె చెడును మక్కువతో జూచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 299

కాలమందు పనికి పాలుమాలినవాడు
పరుల గొప్పగాంచి బాధపడుచు
ఓర్చలేని మనసు మార్చుకోజాలడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 300

ఖలుడు సమ్మెకొఱకు కలతలుఁబుట్టించి
కూడగట్టి హితుల పాడుజేయు
పెద్దవారి హితవు పెడచెవిఁబెట్టుచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 301

కోతి నైనబట్టి కూతనేర్పిన యంత
మాటలాడగలదు మంచిగాను
క్రూరునకును తెలివి కొట్టి నేర్పిన రాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 302

కుక్కకైనగాని చక్కగా నేర్పిన
కర్రపైన నాల్గు కాళ్లఁబెట్టు
హీనగుణునిబుద్ధి నెవరు మాన్పగలేరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 303

చెనటుడెపుడుగాని తన తప్పెఱుంగక
పరుల తప్పు దెలుప ప్రాకులాడి
గుణ విహీనుడగుచు కొంపల గూల్చును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 304

ఇచ్చి చెప్పుకొనెడి హీనుని జేరిన
కడుపు మంటఁబెట్టి కానివేళ
కూలివానిజేయు కూరిమి హితునైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 305

కరుణలేక సతము కలహాలుకొనితెచ్చి
సంపదలనుగోరి సతిని దరుము
కలుష చిత్తుబ్రతుకు కర్మకు గురిజేయు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 306

దేవుడిచ్చుననుచు తెలివిని గోల్పోయి
కాలమెల్ల వృధగ గడపుచుండు
సోమరులకు మేలు శూన్యంబు జగమున
రామచంద్ర వినుత రాఘవేంద్ర 307

చేతఁజిక్కిగూడ చేజారిపోయిన
పక్షిలాగ పదవి వచ్చిపోవు
తెలివి తక్కువైన దేశనాయకులకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 308

పిడికెడన్నమిడిన విశ్వాసమును జూపు
కుక్క కన్నమిడని కూళకన్న
భిక్షకుండుమేలు పేరాశ జూపడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 309

ఆశచేత యముని పాశంబులోఁజిక్కి
కూలిపోయె నాడు కురుకులంబు
పరధనంబుగోరు నరుల కీగతిబట్టు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 310

కాముక చిత్తవృత్తి

వేశ్యలకును బ్రతుకు విపరీతులనుండె
శీలవతుల బ్రతుకు చింత నిచ్చె
దేశ గౌరవంబు నాశనమై పోయె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 311

పాముచెల్మిబోలు వారకాంతల చెల్మి
కాటువేయగలరు కానినాడు
చనవుదప్పినంత చంప యత్నింతురు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 312

రూకకొఱకు తుదకు రోగినైనను గాని
వారకాంత పొందుచేరదీసి
రూకలీయనంత రోయుమన్మథునైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 313

వయసు పడుచుగూడ వయసు చెల్లినవాని
ధనముకొఱకు సతము తపనపడుచు
మానమమ్ముచుండె మరియాద విడనాడి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 314

తన్ను వలచెననుచు తరుణి నెంచగరాదు
మాయ మాటలాడి మనసు జెఱచు
మోసగించు మరియు మోహము జూపుచు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 315

అగుడు మగనిపాలు వగలు పరుల పాలు
రంకులాడి బ్రతుకు జంకులేక
ధరణిలోన చూడ ధర్మంబు నశియించె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 316

గృహిణి విటునిఁజేరు కీడుఁగల్గిననాడు
గృహిణి గృహము జెఱచు కీర్తి జెఱచు
కీర్తి తొలగినంత ఆర్తి అధికంబౌను
రామచంద్ర వినుత రాఘవేంద్ర 317

నగ్నదేవతనుచు నయగుణమది లేక
ప్రేమఁదీర్చనట్టి ప్రియునిఁ జంపి
చెడ్డగుణమువలన శిక్షకు గురియయ్యె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 318

తరుణివలచె ననుచు తలపోయు మూర్ఖుండు
మాయ మాటలకును మదిని నమ్మి
మోహములకు మునుఁగు మోసము నెఱుగక
రామచంద్ర వినుత రాఘవేంద్ర 319

పిల్లవాడుగూడ వెఱ్ఱిగ మోహించి
స్త్రీల జూచినపుడు సిగ్గులేక
భేదబుద్ధితోడ వెనువెంట పోవును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 320

గొంతు పిసికి చంపె కోడలి రతిఁగోరి
వాంఛ తీరనందు వలన మామ
యిట్టి హింస సేయు డెట్టి రక్కసుడైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 321

చుప్పనాతివంటి సొగసు కత్తెనుఁగాంచి
భ్రమలుఁజెందునట్టి కుమతిసతము
భార్యరంభయైన బాగుగ జూడడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 322

చంద్రకాంతిడనరు సౌందర్యవతియైన
భార్యయున్నగాని పామరుండు
వృద్ధవనితయైన వేశ్యను ప్రేమించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 323

రమణి మాయ కోరిగి శమదమ గుణములు
భయము లజ్జ గౌరవంబు వదలి
వెంటఁదిరుగుచుండు వేశ్యలతో ఖలుల్
రామచంద్ర వినుత రాఘవేంద్ర 324

(వావి వరుస గనక పరనారి)

మోహమునకు నరుడు మూన్నాళ్ల ముచ్చటై
ప్రాణమున్నదాక భ్రమనుఁజెందు
నుచ్చమడుగులోనఁ జొచ్చు నీ గలభంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 325

ప్రేమికులకుఁగల్గు వ్యామోహమెక్కువై
ఆత్మహత్యలకును ఆత్రపడిరి
కామమోహమెంత కష్టంబు పాల్జేసె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 326

ఎంతవారలయిన నింతికి దాసులై
మడుగులిడుదు రతివలడుగులకును
కామమోహమెంత కార్యమైననుఁ జేయు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 327

వరుసవావిగనక పరనారి రతిగోరు
క్రూరజనులు భువిని కోతులవలె
తెలివిలేని పనులు తెంపుగఁజేతురు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 328

తీపుమాటఁజెప్పి వేపించి వేపించి
పరవనితలఁజెఱచు పలవ లిలను
పశువులవలె నేడు వర్తించుచున్నారు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 329

విధి విలాసము

రాహు కేతువులకు రవి చంద్రులును(గూడ
చిక్కి కుములుచుంద్రు చేవలుడిగి
కష్టదినములిలను(గల్గు నెవ్వరికైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 330

కాలసర్పమునకు కట్టుపడని యట్టి
దిట్ట యెవడు ఫణిని పట్టిచూడ
విధికి(జిక్కి శివుడు భిక్షాటనము( జేసె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 331

కలికి(జిక్కి నలుడు కాంతతో(గూడియు
కష్టములను( బొందె కాననముల
కాలచక్రమునకు కానివా డెవ్వడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 332

అడితప్పలేక ఆ హరిశ్చంద్రుడు
కాంతతోడ బడసె కష్టములను
కర్మవశత తుదకు కాటికాపరియయ్యె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 333

పూర్వజన్మసుకృత భోగభాగ్యముబాసి
దారవెంట రాఘురూశవుండు
పెక్కు బాధలొందె విపినమ్మునందున
రామచంద్ర వినుత రాఘవేంద్ర 334

పంచ పాండవులను వంచించి కౌరవుల్
క్రూరబుద్ధిచేత కూలినారు
వంచనమున వరుల మించిన ముప్పగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 335

ధర్మరాజువంటి ధరణీశుడునుగూడ
జూదమాడి యోడి సుఖముఁబాసి
విధికి లొంగి తుదకు విరటుసేవకుడయ్యె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 336

కలసి రానివేళ కనకంబుఁ జిక్కిన
దక్క దెవరికైన నిక్కముగను
కలసివచ్చువేళ కసువు బంగారమౌ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 337

పసిడికొండపైన పొరాడినంగాని
ప్రాప్తమగునె? కలసిరానినాడు
అదియె కలసిరాగ అందనిదేముంది
రామచంద్ర వినుత రాఘవేంద్ర 338

కలసిరానినాడు గౌరవంబులు మాని
మనుగ డొక్కరీతి మసలు టొప్పు
కలసిరాక శివుడు కాననమ్ముల కేగె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 339

భక్తవరుల తప్పుఁ బట్టుట సరిఁగాదు
టక్కుమనిషి మాట దక్కదెందు
ప్రజల బాధ గనని పాలన సరిపోదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 340

సింగమునకు గజము కంగారు పడినట్లు
భక్తవరుల శక్తి భక్తిఁగాంచి
యముని కింకరులకు యాతనఁగల్గించు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 341

దానధర్మమందు జ్ఞానధర్మమె మిన్న
నరులలోన భక్తవరులు మిన్న
విద్యలందు వేదవిద్యయె మిన్నయా
రామచంద్ర వినుత రాఘవేంద్ర 342

అశ్వమేధయాగ మార్భాటముగఁజేయు
ఫలితమునకు మించి భక్తివలన
ముక్తిలభ్యంబౌను మూఢజనులకైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 343

గరళమొక్కచుక్క కడవెడు పాలను
జెఱచునట్లు వేశ్య జెఱచు జగతి
శిష్టజనులనైన కష్టాలపాలేసి
రామచంద్రవినుత రాఘవేంద్ర 344

శాంతగుణమువలన సత్కీర్తి లభియించు
శాంతగుణముగొప్ప సౌఖ్యమిచ్చు
శాంతమణగనేని సకలంబు దుఃఖమే
రామచంద్ర వినుత రాఘవేంద్ర 345

ఐకమత్యమున్న అన్నియు నెరవేరు
ఐకమత్యమందు నడుపుఁగలుగు
ఐకమత్యమణగ అపదల్ మితిమీరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 346

మంచితనమువలన మాన్యత చేకూరు
మంచిగుణము మంచి మైత్రి నిచ్చు
మంచిబుద్ధిలేని మనుజుండు చెడిపోవు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 347

మంచిచోటుఁజేరు మనుజుండు సుఖమొందు
కానిచోటుఁజేర కష్టమొదవు
తెలివిఁగలిగి బ్రతుక ధీరుడై వెలుగొందు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 348

మనసు మంచిదైన మంత్రంబు ప్రాప్తించు
మంత్రముండినంత మాన్యమలరు
మాన్యమలరెనేని ధన్యుడౌ భువిలోన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 349

తండ్రి హితవు విననిి తనయుండు చెడిపోవు
తల్లి హితవు విననిి తనయ చెడును
భర్త హితవు విననిి భార్యయు చెడిపోవు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 350

కలహములను గృహము కళకళ లాడదు
కలతలేని గృహము వెలుగుచుండు
కలసిమెలసియున్న గౌరవమొనగూడు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 351

పొలతిమంచిదైన కలుగు గౌరవమెంతొ
గౌరవంబువలన ఘనత వెలుగు
ఘనత వెలిగెనేని కామిత మీడేరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 352

దీపమున్న యపుడు తీర్చిదిద్దిన యిల్లు
కలిమి బలిమిఁగలిగి వెలుగుచుండు
దీపమారినంత ఆపదల్ మితిమీరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 353

ఐనవారితోడ కానివారలతోడ
యొక్కరీతి మెలగుచుండు నరుడు
యోగివంటివాడు యుగ యుగంబులనైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 354

ఇంపుమాటలాడి హితమెదుటికి గూర్చి
గౌరవముగ బ్రతుకు గడపువాడు
పేదయైనగాని పేరు వహించును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 355

నటనఁజేయువాడు నగుబాటుఁగాకుండ
నటనఁజేయవలెను నాట్యమెరిగి
అట్టివానిఁజూచి అందరు శ్లాఘింత్రు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 356

పదుగురాడిరనుచు పాటించినట్లైన
హితవు గాని మాట పతనమిచ్చు
నెవరికైన తప్పు దీపరమార్థంబు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 357

గుణము ఉన్నవాని కులము గొప్పదియౌను
గుణము లేనివాని కులముకన్న
నయగుణాన నందనారు కులము వెల్గె
రామచంద్ర వినుత రాఘవేంద్ర 358

తల్లిఁదండ్రి తప్పులుల్లమం దెంచక
ప్రతిదినంబు భయము భక్తిఁగలిగి
పూజఁజేయువాడు పొందును సత్కీర్తి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 359

పిట్ట కొంచెమనుచు నట్టె దలచరాదు
కూత గొప్పదగును కువలయమున
బాలవాక్కుగూడ బ్రహ్మవాక్కగుచుండు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 360

ధైర్యమున్నవాని శౌర్యము ఫలియించు
శౌర్యమున్నవాడె సాహసుండు
సాహసునకు పనులు సమకూడి సుఖమిచ్చు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 361

లాభమెక్కువైన లోభత్వమెక్కువౌ
కోర్కెదీరుకొలది కోర్కెలురలు
ఆశలేనివాడు అనఘుండు లోకాన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 362

మౌనివరుల హితవు మదిలోన భావించి
ప్రీతితోడ నాచరించువాని
జన్మసార్థమగును చండాలునికినైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 363

కోట్లు లభ్యమైన గుణహీను కొల్వుకు
పూనరాదు నీతి మానరాదు
స్వల్పమైనగాని సాధుసేవయె మేలు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 364

ఈడువాని చెల్మి నెడబాయకుండుట
నున్నచోట నుండు టొప్పుకొనుట
మంచివానికివ్వి మనెడు లక్షణములు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 365

అన్నమున్నదనుచు నధికంబుగా తిన్న
కడుపునొప్పిఁగలిగి చెడుగు నిచ్చు
మితినిఁదప్పినంత వెతలుఁగల్గించును
రామచంద్ర వినుత రాఘవేంద్ర 366

దుష్టగుణము లెల్ల తొలగిపోవు విరాన
శిష్టజనుల చెల్మిఁ జేసినంత
మందుపూయ పుండు మానిపోయిన భంగి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 367

పాము పుట్టమీద పవ్వళించినలాగ
చెడ్డగుణమువారి చెల్మివలన
బాధలెక్కువౌను ప్రాణభీతియుఁ గల్గు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 368

కన్నతల్లిఁ దండ్రి కన్నెనిచ్చిన మామ
విద్యనేర్పినట్టి విబుధవరుని
దైవసములటంచుఁ దలపోయుటే నీతి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 369

ధీరుడగుచు భయముఁ దీర్చినవానిని
నీతిఁ దెలియు విద్యనేర్పువాని
ధర్మదాతలనుచుఁ దలపోయుచే మంచి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 370

వేడుకొనెడివాని గోడునుఁ గమనించి
నాయపడక కీడు జేయువాని
దైత్యసముడటంచు దలపెట్టుచే తగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 371

తానొసంగినట్టి దానధర్మంబులు
కీడుమాన్పి గొప్ప కీర్తినిచ్చి
హీనజనునికైన యీప్సితార్థ మొసంగు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 372

కల్లమాట వినక గమనించి సత్యము
పరహితార్థమునకు పాటుఁబడెడి
వాని గొప్పతనము వసుధలో వర్ధిల్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 373

కాలమందు పైరు గమనించి పెట్టిన
పంట పెరిగి గొప్ప ఫలితమిచ్చు
చిన్ననాటి చదువు వన్నెకెక్కిన యట్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 374

చవిటి నేలలోన చల్లిన విత్తులు
మంచిపంటనిచ్చి మించనట్లు
వెకిలి దంపతులకు బిడ్డలట్లగుదురు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 375

మానహీనుడైన మర్యాదపోయిన
ధన విహీనుడైన తనువు చెడిన
అడితప్పరెప్పు డనఘచారిత్రులు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 376

కష్టకాలమైన కార్చిచ్చు పాలైన
అంత్యకాలమైన అనఘమతులు
నీతి తప్పరెపుడు ఖ్యాతికి పాత్రులై
రామచంద్ర వినుత రాఘవేంద్ర 377

గురుని విద్య యెంత గొప్పదైననుగాని
శీలహీనమైన చెడును ఘనత
శిష్యులకును మేలు చేకూరగాబోదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 378

పర్వదినములందు భ్రాంతిఁగల్గిన గాని
సతిని గవయబోడు సజనుండు
నీతిలేని పూజ నిరుపయోగంబని
రామచంద్ర వినుత రాఘవేంద్ర 379

ఇంటిలోని కలత చంటిబిడ్డల యేడ్పు
కంటిలోని చీము పంటినొప్పి
యింతితోడపోరు చింతకు గురిజేయు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 380

పోరునిష్టమిచ్చు పొందు లాభము నిచ్చు
పొందుఁగోరువాడు పొందు సుఖము
పోరు గోరువాడు క్రూరుడై చెడిపోవు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 381

కర్మ రోగిరోత కల్లంగిడియు రోత
ఖరము పాలు రోత గల్లరోత
కామసుఖము రోత గమనించినట్లైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర

శక్తి యున్నవరకు జాగ్రత్త వహియించి
బ్రతుకు మార్గమునకు పాటుబడెడి
నరుడు సౌఖ్యమందు పరుల పీడింపక
రామచంద్ర వినుత రాఘవేంద్ర

కీర్తిఁగల్గియున్న కృతికర్తలకు గొప్ప
సాయమిచ్చుచున్న సజ్జనులను
మరువనట్టివాడు మహితాత్ముడౌసుమీ
రామచంద్ర వినుత రాఘవేంద్ర

వారకాంతతోడఁజేరి తిరుగరాదు
పరహితోక్తి నెపుడు మరువరాదు
కామ మోహములకు కట్టుఁ బడగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 385

అల్పగుణుని మాట లాలకింపగరాదు
ముసలివానిఁజూచి కసరరాదు
విద్యఁగలిగినంత విఱ్ఱవీగగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 386

ఐనవారిచెంత అప్పుఁజేయగరాదు
అప్పులడుగునపుడు త్రిప్పరాదు
త్రిప్పుఁగొట్టువాడు తిప్పలు పడుచుండు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 387

మద్యపానమునకు మమతఁజూపగరాదు
కాని పనులుఁజేయ పూనరాదు
పేదవారినెపుడు వేధించగారాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 388

తప్పు సౌఖ్యములకు నొప్పుకొనగరాదు
తంటమాట జెప్పఁదలచరాదు
దారిదోపిడీలఁ జేరదీయగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 389

చేసినట్టిమేలుఁ జెప్పుకొనగరాదు
పరులమేలు నెపుడు మరువరాదు
యెవరి గొప్పకైన నీర్ష్యఁజెందగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 390

ఎవరికైనగాని యెగ్గుఁదలచరాదు
తనకు తానె పొగడు కొనగరాదు
కూలివాని కడుపుగొట్టి బ్రతుకరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 391

కూర్మి సతికినైన గుట్టు జెప్పగరాదు
పెద్దవారి చెల్మిఁజేయరాదు
పరధనంబుకొఱకు ప్రాకులాడగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 392

కరుణ లేనివానిఁ గడప ద్రొక్కగరాదు
దానమిడనివాని దలచరాదు
నీతి లేనివాని నీడ నుండగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 393

పొలుమాలి దైవభక్తి మర్వగరాదు
జీవహింస నెపుడు సేయరాదు
కాని పనులకొఱకు కలతఁజెందగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 394

బంధుహితులతోడ పగబూనగారాదు
భోగలాలసులను పొగడరాదు
కానివానినైన కష్టపెట్టగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 395

అప్పు చేయరాదు ఆదాయమును మించి
జాగు చేయరాదు చదువు గూర్చి
అడ్డు జెప్పరాదు దొడ్డవారి హితోక్తి
రామచంద్ర వినుత రాఘవేంద్ర 396

కలిమి గలిగినంత గర్వింపగా రాదు
గొప్పలేమిఁగలుగ కుమలరాదు
కలిమిలేములిలను కావడి కుండలౌ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 397

లిబ్బి దొరికినంత యుబ్బిపోవగరాదు
డబ్బు నిల్వదెపుడు మబ్బులాగ
వచ్చి పోవుచుండు వర్షము పడినట్లు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 398

కష్టములకుగాను గంతులేయగరాదు
చోరులకును దారిఁ జూపరాదు
అల్పబుద్ధివానినాశ్రయింపగరాదు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 399

కామ మోహమునకు కష్టాలు మితిమీరు
కామవాంఛ తనదు ఘనత చెఱచు
కామమణచెనేని కామిత మీడేరు
రామచంద్ర వినుత రాఘవేంద్ర 400

కామ లోభ మోహ కర్మ రోగాలను
శుద్ధిజేసి రామ జోగిమందు
కామితార్థమొసగు పామరులకునైన
రామచంద్ర వినుత రాఘవేంద్ర 401

మట్టిలోనఁబుట్టి మట్టిలోనఁబెరిగి
మట్టిలోనఁగలియు మాయ తనువు
మీద భ్రమలు జెందరాదు మానవులకు
రామచంద్ర వినుత రాఘవేంద్ర

తనువశాశ్వతంబు ధర్మమే నిలుకడ
ధనమశాశ్వతంబు ధరణియందు
మదమశాశ్వతంబు మంచియే నిలుకడ
రామచంద్ర వినుత రాఘవేంద్ర 403

జయము రవికులేంద్ర జయము సద్గుణ సాంద్ర
జయము పూర్ణచంద్ర జయము జయము
జయము కోసలేంద్ర జయము దయాసాంద్ర
రామచంద్ర వినుత రాఘవేంద్ర 404

సర్వేజనాస్సుఖినోభవంతు.

సమాప్తము.



# అంకితము

శ్రీరమాహృదయేశ శ్రితభక్తజనపోష
శిష్టగుణాన్వేష చిద్విలాస
శ్రీ అంజనాద్రీశ శేషాచలాధీశ
గరుడాచలేశా జగన్నివాస

శ్రీ వృషభాద్రీశ శ్రీ భవ్యదరహాస
నీలాద్రి సువిలాస నిర్జరేశ
శ్రీ వేంకటాద్రీశ శృంగార తరవేష
నారాయణాద్రీశ నయవికాస

సప్తగిరివాస భువనేశ సత్ప్రకాశ
దివ్యమణిమయ భూష శ్రీ తిరుమలేశ
మౌని పుంగవతోష పద్మావతీశ
వేడ్కగొనుమంకితమ్మిదే వేంకటేశ!!